# రత్నసుందరి

పండిత సత్యనారా[illegible]

రావు బ్రదర్సు (రిజిష్టర్డు)
తెనాలి



# రత్నసుందరి

విద్వాన్, కవి.

పండిత పెనుమెత్స సత్యనారాయణరాజు

పిఠాపురం సంస్థాన గౌరవాస్థాన కవి

సీనియర్ తెలుగు పండితుడు

బోర్డు హైస్కూలు, తుని.

పబ్లిషర్సు

రావు బ్రదర్సు (రిజిష్టర్డు)

తెనాలి

 [రు. 1—0—0

# ప్రవేశిక

నేఁటి కిరువదియేడేండ్లనుండి నేను హైస్కూలు విద్యార్థులకు గురుత్వము వహించి యున్నాను. వివిధ భావ సంపన్నులగు విద్యార్థుల మానసిక తత్త్వముల నారసియున్నాను. స్కూలు ఫైనలులోపలి ప్రతి విద్యార్థియు నుపాఖ్యానములతోఁ గూడి నీతిబోధకముగా నున్న గ్రంథమును జదువుట కెక్కువ మక్కువ చూపుచుండును. చిన్ననాఁటి నాఁటఁబడిన నీతిబీజములే విద్యార్థుల మానసక్షేత్రముల మొలకలెత్తి మహావృక్షములై మధురఫలములను లోకమునకుఁ బంచియిచ్చును. కాన నట్టి గ్రంథమేదేని వ్రాసి విద్యార్థిలోకమున కందఁజేసి కృతకృత్యుఁడను గావలయునని పెక్కునాళ్లనుండి తలంచుచు సంస్కృతాంధ్ర వాఙ్మయంబునఁ గల పెక్కు గ్రంథములను బరిశీలించితిని. హితోపదేశ పంచతంత్రాదుల నారసి చిన్నయసూరి యీ వఱకే నీతిచంద్రిక వ్రాసియుండెను. దానిఁబోలు యుత్తమ నీతిగ్రంథము వేఱొక్కటి యాంధ్రమున వెలయింప సమకట్టితిని. నా విద్యార్థిదశలో గురుదేవులు శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారితోడ (ఒద్ది) సంస్కృతము చదివిననాఁడు రాజశేఖర మహాకవి వ్రాసిన విద్ధసాలభంజిక నా మనమున నాటియున్నది. పిమ్మటఁ గొన్నాళ్లకు దానికిఁ బ్రతిబింబమైన కేయూరబాహు చరిత్ర చదివితిని. విద్ధసాలభంజికకన్నఁ గేయూరబాహు చరిత్రయే మిన్నగనున్నది. కావుట దాని నాధారముగాఁ జేసికొని నాతికఠినము నాతిసులభము నగు శైలిలో రత్నసుందరియను నీ నీతిగ్రంథము వ్రాసితిని. అచ్చువేయకమున్నె దీనిని ఇంచుమించు వెయ్యిమంది విద్యార్థులకుఁ జదివి వినిపించితిని. భిన్నప్రవృత్తులుగల విద్యార్థులను బ్రశ్నించి యీ గ్రంథము వారి యాదరమునకుఁ బాత్రమైనదిగాఁ దెలిసికొంటిని. అంతతోఁ దనివుసనక మా నరేంద్రనాథ సాహిత్యమండలిలోఁగల వివిధ

భాషాకోవిదులకు వినిచితిని. వారిమెప్పును గాంచితిని. ఇన్ని వడపోఁతలు పోసిచూచికొని యిప్పుడు దానిని వెలయించితిని. ఈ యుత్తమ నీతి గ్రంథము నా కాప్తమిత్రులు మద్రాసు ప్రభుత్వపు వ్యవసాయశాఖకు మాజీమంత్రులు నగు శ్రీ పూసపాటి (P. S.) కుమారస్వామి రాజుగారికి అంకితమిచ్చి ధన్యుఁడనైతిని. నేనీ పుస్తకము వ్రాసిన యుదంతము నెట్లు తెలిసికొన్నారోకాని రావుబ్రదర్సు కంపెనీ కర్తకారులను శ్రీ కోటంరాజు కామేశ్వరరావుగారు నాయొద్దకు వచ్చి 'యీపుస్తకము మాకిండు. చక్కఁగ ముద్రింపించి యాంధ్ర విద్యార్థిలోకమున కందఁజేయుదము' అని యడిగినారు. కామేశ్వరరావుగారి, ముఖవికాసము, మృదుమధుర సంభాషణము నన్ను ముగ్ధునిఁజేసినవి. భగవత్కటాక్షముచే గ్రాసవాసోదైన్యము లేని వాఁడనగుట 'నట్లే కానిండు. ఇదిగో పుస్తకము గొనుండు' అని వారి కొసంగితిని. ఒసంగుటయే తడవుగా నచ్చొత్తించి ప్రకటించిరి.

కృతికిఁ దగిన భర్త, ప్రకటన కర్త లభించిరి. ఇఁకఁ గావలసినదేమి? గ్రంథము నాయుష్మంతులగు నాంధ్రవిద్యార్థుల కందఁజేసితిని. ధన్యుఁడ నైతిని.

శ్రీ విక్రమవిలాస్
తణుకు, 15-6-47

పండిత సత్యనారాయణరాజు

# సమర్పణము

మాధవవర్మ మీ కొలము మానిక మంచికిఁ బూజచేసి ము
న్నీ ధరణీస్థలానఁ గురియించెను 'బంగరువాన' యన్న యా
గాథను నమ్మి నెమ్మదిని, గాదన కిచ్చితి నాదు పుత్త్రికన్
భూధవులందు నీవు కడు పూజ్యుఁడవంచుఁ గుమారరాణ్మణీ !

సంతానంబది లేనివాఁడవనిలో సంతాపముం బొందకా
సంతానంబుల నేడిటన్ స్థిరము సూ ! సత్కావ్య సంతాన మ
శ్రాంత త్యాగివి కాన నిచ్చితిఁ గుమారస్వామిరాజేంద్ర! మ
త్సంతానం బగు కావ్యపుత్త్రిక యథాశాస్త్రంబు గైకోఁ గదే !

ప్రణయమూర్తివి దూరస్థబంధుఁడవును
గావుటను నీకు నా కావ్యకన్య నిడితి
పూసపాటైన మా కన్య యూసపడదు
ప్రభువులగుఁ గాక శ్రీ పూసపాటివారు.

ఆకారంబున, సత్కులీనత, మహాత్యాగంబునన్ సంపదన్
లోకారాధ్యగుణంబులన్ రసికతన్ రూపొంది పెంపొందు నీ
కీ కన్యన్ శుభమస్తటం చొసఁగి నే నెంతే ముదంబందితిన్
రాకాచంద్ర వినిర్మలాత్మక ! కుమారస్వామిరాజా ! మదిన్.

కన్యాకుమారికాగ్రంబునం గూర్చుండి
సరససల్లాపముల్ సలుపఁ గలవొ
కుర్తాల జలపాత కూలంబునందుండి
ప్రణయ ప్రసంగముల్ పలుకఁ గలవొ

మలయాద్రిసానుభూస్థలముల విహరించి
శూనిరాగంబులం గులుకఁ గలవొ
యేలాలతానవ్యడోలల నూఁగుచు
కవితా విలాసముల్ కఱపఁ గలవొ

నవ్య నవరసభావయౌ నాదు సుతను,
ఒజమ్మైఁ గుమారస్వామిరాజ! చూతుఁ
గాక వేంకటరాజు తాఁ గాంచి యిద్ది
సరసముగఁ జెప్పఁ గావుత 'జడ్జిమెంటు'.

ఘనుఁ డౌ విక్రమదేవవర్మ జయపూర్ క్ష్మానేత తా నొక్కఁడున్
ప్రఖ్యాత ప్రజ్ఞుఁడు మంత్రివర్యుఁడు కుమారస్వామిరా జొక్కఁడున్
జనుఁడై శోభిలు రామకృష్ణయను నైసీయస్సు తా నొక్కఁడున్
దన 'కల్లుంప్రటు' తిమ్మరా జను జమీందారుండు తా నొక్కఁడున్.

అని నను జనములు పొగడఁగ
విని యుబ్బక, నవ్యకావ్యవిమలాంగి నిదే
కొను రత్నసుందరి నిడితిఁ;
బ్రణుతింపఁగ నిన్ను రాజపాలెమువారల్.

ఇతిశివమ్.

# రత్నసుందరి

## ౧

శ్రీమంతంబగు మన యాంధ్రదేశంబునకు నుత్తర దిశ యందుఁ గళింగ దేశము గలదు. అది సర్వసంపదలకు నాకరము. త్రిపురీ నగరమందలి పట్టణములలోఁ గణింపఁ దగినది. నాగ కన్యలు జలక్రీడలాడు కందకములు, దేవతాస్త్రీలు విహారము చేయు నుపవనములు, ఆణిముత్యములు, నవరత్నములు, బంగారపు రాసులు గల యంగడివీథులు; మంగళ వాద్యములు, వారాంగనా లాస్యములు, సామగానములు గల దేవాలయములు; చలువరాతి యరుగులు పచ్చలమెట్లు గల సరస్సులు, భద్రగజములు, ఉత్తమాశ్వములు, కపిలగోవులు, పెంపుడు నమిల్లు, నానావిధ ఫలవృక్షములు, లతా మండపములు, పూఁదోఁటలు గలిగి యా పురంబు కనులపండువు చేయుచుండును. అందలి బ్రాహ్మణులు అత్రిసమానులు. క్షత్రియులు అర్జునమూర్తులు. వైశ్యులు కుబేరరూపులు. కృషికులు విదురాకారులు. చల్లని 'పైరు'గాలులఁ బీల్చుచు, పావనోదకంబులఁ ద్రావుచు నందలిజనులు నిరామయులై గ్రాసవాసోదైన్యములేక సుఖములఁ దేలుచుండిరి.

ఆ పురమును జంద్రకేతు వంశజుఁడును లక్ష్మణపుత్త్రుఁడును నగు మహేంద్రపాలుఁడు చిరకాల మేలెను. వానిపిమ్మట నతని కుమారుఁడు కేయూరబాహుఁడు ఆ రాజ్యమునకు నేత యయ్యెను. ఆతఁడు దయాసముద్రుఁడు. కీర్తిమూర్తి. రిపు భయంకరుఁడు. రూపమన్మథుఁడు. ఉదయాస్తగిరులు వాని ప్రతాపమునకు దీపికాస్తంభములు. ఇంద్రునకు బృహస్పతియుఁ, జంద్రగుప్తునకుఁ జాణక్యుఁడును, వత్సరాజునకు యుగంధరుండునుబోలె నా రాజునకు భాగురాయణుఁడు మంత్రియై విలసిల్లెను. అతఁడు మంత్రిమాత్రుఁడు గాఁడు దృఢకాయుఁడు, అందగాఁడు. వంశక్రమాగత విస్తారబుద్ధి. ధీరుఁడు, శూరుఁడు, గంభీరుఁడు, అవ్యసని. ప్రజారంజకుఁడు. దయామయుఁడు, నిత్యసత్యవ్రతుఁడు, నిజమర్మగోపన నిపుణుఁడు, పరమర్మభేదనచతురుఁడు, సాదరోక్తిశీలుఁడు, విద్యాసాగరుఁడు. కులీనుఁడు, ఆలస్యరహితుఁడు. ఔచిత్యపరుఁడు పరేంగితజ్ఞుఁడు, రాజభక్తి పరాయణుఁడు, శత్రుభయంకరుఁడు, విశ్వదాత అని ప్రఖ్యాతిఁ గాంచెను.

ఆ మంత్రివర్యున కేలికయైన కేయూరబాహుఁడు రత్నసుందరి తన కర్దాంగి కాఁగాఁ గామాసక్తుఁడై కేళీపర్వత రత్నకందరంబులను, క్రీడాగృహంబులను, లీలోద్యానములను, లతాకుడుంగములను, సదా విహరింపుచుఁ బ్రభాతము రాకలు గాని రాత్రి పోకలుగాని యెఱుంగకయుండెను.

ఇట్లు కరసమగ్నుఁడై ప్రమత్తుఁడై యున్న తనరాజుచందము నారసి భాగురాయణుఁడు చింతల వంతలఁ జిక్కి యెట్లీ కొఱ

గాములనుండి తన యేలికను దప్పింతునా? యని యుపాయము లేని యుపాయమును వెదకుచుండెను.

ఇంతలోఁ దా నింతకుమున్ను నానాదేశ వృత్తాంతమ్ముల నరసి రాఁ బంపిన ధీనిధి యగు మతిమంతుఁ డరుదెంచి నమస్కరింప భాగురాయణుఁడు వానికి నేకాంతం బిచ్చిన వాఁడును దన యరయం బోయిన లాటదేశమందలి విశేషంబు లెఱింగించి, మహారాష్ట్రాధినాథుఁడగు పరిఘబాహుఁడు తనమీఁద దండెత్తివచ్చుచునికి విని యతని యుద్ధతి యోర్వక లాటేశ్వరుఁడగు చంద్రవర్మ చింతించుచున్నాఁ డని యెఱింగించి మఱియు నిది యొక్క రహస్యం బెవ్వ రెఱుంగనియది యవధరింపుమని యిట్లనియె.

“అమాత్యశేఖరా! లాటదేశాధీశుఁ డగు చండవర్మకుఁ గొడుకులు లేరు. ఒకే పుత్రిక గలదు. తన పూర్వులందఱు నేకసంతతులగుట యెఱిఁగి యతఁడు తన రాజ్యంబు నన్యులాక్రమింపకుండ నుండుటకై యా పుత్త్రికను బుత్త్రుఁ డని చాటఁ దొడంగెను. ఈ విషయంబు వాఁడును, వాని భార్యయు, దాదియుఁ దక్క నన్యు లెఱుఁగరు. ఆ కన్యాలలామ యిప్పుడు నిండుజవ్వనంబున నివ్వటిల్లుచున్నది. ఆమెం బెండ్లాడినవాఁడు సార్వభౌముఁడు కాఁగలఁడని యొక ముని తత్పితృజనములతో వచించెను. ఆమె పేరు మృగాంకావళి. కాని మృగాంకవర్మ యని పుత్రనామంబునఁ బిలుతురు.” అని విన్నవింప భాగురాయణుఁడు మెచ్చి వానికిఁ బసదనం బిచ్చి వీడుకొల్పెను.

## ౨

అంతట భాగురాయణుఁడు తన మేనల్లుని సోమదత్తుఁ డనువాని రావించి తన రాజు వర్తనమును; జారులచేఁ దా విన్నవియు, మీఁదఁ దాఁ జేయఁ దలఁచినవియుఁ జెప్పెను. లాటరాజువోలెఁ గార్యగుప్తి కావింపవలయుననే కాని మతి హీనతచే జనపతినయ్యెదననుట వెఱ్ఱితనమనికూడఁ దెలిపెను.

అది విని సోమదత్తుఁడు మంత్రిమణియైన భాగురాయణునితో నిట్లనియెను.

మంత్రిశేఖరా! యీ భూమియం దెంద ఱెందఱో బుద్ధిమంతులు గలరు. కావుననే 'బహుగుణరత్నా వసుంధరా' యను వాక్యము పుట్టినది. బుద్ధి యొకరిసొమ్ముగాదు. పూర్వ మొక వైశ్యబాలిక బియ్యముసరి నూనె యమ్మియు లాభముఁ గొన్నది. అది కని పెద్దలు మెచ్చిరి. ఆ కథ విన్నవించెదను. అవధరింపుము.

కాంచీపురమునఁ గాంచనగుప్తుఁ డను వైశ్యుఁ డొకఁడు గలఁడు.

వాఁడు తనసుతునకు వివాహము చేయనెంచి యొక కన్యారత్నమును నెమకి రండని యాప్తులను బంపెను. వారు చని యా పురంబునఁగల వైశ్యబాలికల నారయుచుండిరి. అప్పు డచ్చట నొక సంత సాగుచుండెను. ఆ సంతలో నొకఁడు తన యొద్ద నున్న మానెఁడు వ్రాలకు (బియ్యము) సరి తైలము పోయుఁడని నూనె యమ్మువారి నెల్ల నడిగెను. అదివిని వారందఱు ఓరి నీవెఱ్ఱికాల! మానెఁడునూనెకు నేడు మానికెల

బియ్యము వచ్చుచుండఁగా బియ్యమునకు సరి నూనె యెవ్వ రిత్తురురా? నీకు మతిలేనిచో నితరులకు మతి కలుగదా! చాలు, పొమ్ము. అని కసరిరి. కాని వాఁడు తొంటియట్ల సంతయెల్లఁ దిరిగి తిరిగి యడుగఁజొచ్చెను. ఒక కోమటికన్య యదివిని చెంతకుఁ బిల్చి, నీకు ప్రాలసరి నూనె కావలయునా? సరి. ఏవీ నీ బియ్యము? మంచి వేనా? చూడనిమ్మని యిట్లని యెను. "ఓయీ! నేను బియ్య మొకదానితోఁ గొందును. దానితోడనే నూనె దిగువాఱఁబోసెదను. ఇది నీ కిష్టమగునా? కాదా? ముందే చెప్పుము. పిదప నీతో జగడములాడ లేము" అనుటయు వాఁ డందుల కంగీకరించెను. ఆమె యొక పళ్ళె రంబు తెచ్చి బియ్యము దాని నిండఁ గొని యందె యంచులు దిగువాఱ నూనెపోసెను. అది కని వారు శీఘ్రంబుగాఁ జని యావిషయమంతయుఁ గాంచనగుప్తునకు వినిపించిరి. అదివిని వాఁడు ఆమె బుద్ధి విశేషమును మెచ్చుకొని దానినిఁ దన కోడలిఁ జేసికొనెను. కావున మతిగలవారు లోకమున లేకపోరు. మనుజున కొక్క మతియున్నమాత్రమునఁ జాలదు. దానితో పాటు తాత్కాలిక మతిగూడ నుండవలయును. లేనిచోఁ బ్రమాదము వాటిల్లును. తాత్కాలిక మతిచేతన దక్షుఁ డనువాఁ డొక ప్రమాదమును గడచెను. ఆ కథ వినుతును. వినుఁడు.

క్షురికాపురమున దక్షుఁ డను బ్రాహ్మణుఁ డొక్కఁడు గలఁడు. వాఁడు సులభవివేకస్ఫురణుఁడు. కాని లాభ మేమి? యౌవనదోషముచేఁ గాముకుఁ డయ్యెను. వాని పొరుగింటి యంగన చక్కని చుక్క. దాని మగఁడు మేటి విలుకాఁడు. ఉగ్రమూర్తి. అది యెఱిఁగియు వాఁడు ఆమెను జెఱుపఁ దల

పెట్టెను. ఆమె యొంటరిగ నేదిక్కునకుఁ దిరుగునో తా నా దిక్కునకుఁ దిరిగి వాఁడు మ్రొక్కఁదొడఁగెను. అది యిరుగు పొరుగువారు కనిపెట్టిరి. యామెమగని కావిషయముఁ దెలిపిరి. అదివిని వాఁడు మండిపడి 'సరే చూచెదనుగాక. వాన్నియాగడ మెన్నాళ్లు సాగునో?' యని తనయింటిలో గోడచాటున డాఁగి యుండెను. దక్షుఁ డదియెఱుంగఁడు. ఆమె యథాప్రకారము తన యింటినుండి యేదో పనివెంట నరుగుమీఁదికి వచ్చెను. ఆమెనుగాంచి వాఁడు మునుపటియట్ల చిఱునవ్వుతో మ్రొక్కెను. అది కని యదరిపడి దాని మగఁడు తటాలున లేచి నిలిచెను. దిట్టఁడైన దక్షుఁడు వానిఁగాంచి చలింపక యంతతోనాఁగక యన్నిదిక్కులకు మ్రొక్కి సూర్యునకుఁ బ్రదక్షిణ మాచరించెను, సూర్యమంత్రములు జపించెను. అదియంతయుఁ జూచి భటుఁడు అది జపముతోడి; మ్రొక్కని తలంచి కోపంబుడిగి తలఁగిపోయెను. చూచుఁడు తాత్కాలికమతిసంపద, యాపద నెట్లు దాఁటించెనో! అంతియెకాదు. మతిలేనివాఁడు విద్యాన్వితుఁ డయ్యును మేలు పొందనేరఁడు. గార్గ్యుఁడు చదువరి యయ్యును విమతియై యొక పులిచేత హతుఁ డయ్యెను. ఆ కథ మీరు వినఁదగినది. చెప్పెదను. ఆలకింపుఁడు.

గార్గ్యుఁడను విప్రుఁ డొకఁడు గలఁడు. వాఁడు దుర్గమారణ్యమున కరిగి దుర్గ నారాధించెను. దుర్గాదేవి వాని తపంబునకు మెచ్చి వరమడుగు మనెను. అందుల కతఁడు సంతసించి 'తల్లీ! నాకుఁగూర్తువేని సంజీవని నొసఁగుమ'ని ప్రార్థించెను. పరమేశ్వరి వానిప్రార్థన మంగీకరించి చేయిచాఁపుమని తన కరపద్మమునఁ గల కొన్ని పచ్చని యాకులు వాని కిచ్చి

యోయీ ! వీని రసము శవములపైఁ జిలుకుము. వెంటనే వానికిఁ బ్రాణములు గలుగును. ముందటి రూపు వచ్చును. తొంటి తేజంబు చూపట్టును. ఇవిగో కొనుము. ఈ యాకులు ఎండవు. తఱుఁగవు. అని చెప్పి యంతర్ధాన మయ్యెను.

వాఁ డా యాకులు గైకొని యింటిబాట నంటి చనుచుఁ ద్రోవలో నొక్క నిర్జనవనంబును గని యందు నెండి సొరుగై యున్న యొక్క పుండరీక (పులి) శవంబును గాంచి దాని చెంతకుఁ జని తా నొందిన యౌషధశక్తినిఁ బరీక్షింపఁగోరి తన చేతికోలఁది యాయాకుల నలఁపి పసరు దానిపైని బిడిచెను. పిడిచినతోడనే యా పులి నిద్ర మేల్కనినదానివలె లేచి యఱచుచు, వానిపైఁబడి చంపి- వాఁడి గోళ్లచేఁ గంఠం బూడుకొనఁ జఱచి, జోట జోట కాఱు రక్తం బాప్యాయనం బుగఁ ద్రావెను. అభాగ్యులగు బుద్ధిహీనులు మేలుగాంచియు దాని ఫల మందఁజాలరు గదా! మతియె కళాకృషికి బీజము. మతియె స్వఫలప్రదవృక్షము. మతియె చుట్టము. మతియె స్నేహితుఁడు. మతిహీనులు వట్టి చెట్టులు. అని పలికి వాని మతిని గొనియాడి యా ప్రసంగంబు గట్టిపెట్టి తమ రాజు వర్తనంబు తడవి చేయవలసిన కార్యంబు చేయందలంచి సోమదత్తుఁడు మేనమామ కిట్లనియెను.

మామా ! ఎవ్వఁడే రసమునకుఁ బ్రియుఁడో వాని కా రసమునం దధికరుచి పుట్టించినచో వాఁడు తన తొంటిమార్గ మునుండి మనస్సును మరలించి వేఱొకత్రోవ పట్టును. కావున మన రాజునకు మన రాణికంటె నందగత్తె యగు వేఱొక కాంతను గనఁబఱచి వాని మన సారాటపడఁ జేయవలయును.

కలఁడు. వాఁడు సంధివిగ్రహసంధాన చతురుఁడు. మేధావి. కావునఁ జతురక్రియజన చతుష్టయమును గూడఁ దనవశం బొనర్చుకొని వారి కిష్టుఁడై హృష్టుఁడై చరించుచు నొక్క నాఁడు అర్థపాలుని యింటికిఁ జని యిష్టాలాపగోష్ఠి నడపుచుఁ బరమాప్తుండువోలె 'అర్థపాలా ! చతురుఁడు నీ వనిఁ బడి చచ్చునఁట నిజమేనా?' యని యడిగెను. అందుల కాతఁడు సంతసించి 'మందారా! యా సుందరు నందచందములపొందు నేమని వచింతును? నారాక గాంచినతోడనే యాతఁడెన్నఁడు దాల్పని క్రొంగ్రొత్త దుస్తులఁ దాల్చి యన్యుల నేరిని దరికిఁ జేరనీయక నన్నె మచ్చు పైఁజల్లినట్లు ప్రేమించు'నని చెప్పెను.

అది విని మందపాలుఁడు మంత్రిపుత్రుఁడగు బహుతంత్రు మందిరంబునకుఁ జని యర్థపాలకు నడిగినట్లు యడుగ నతండు 'మందారా ! వానికి నాపైఁగల యనురాగము నెంత యని పొగడుదును. తాను నా వీనుల కింపుగాఁ బాడును. నాచేఁ బాడించును. వినోదంబుగ జూద మాడును. నా చెప్పుకథ లాలించును. నన్ను లాలించును. పూలుదుఱిమికొని బంగరు బొంగరమువలె నాయెదుట రంగుల నీనుచుండును.' అన విని వాఁ డచ్చోటు వీడి దండధారు నింటికిఁబోయి తొంటియట్ల నడిగిన వాఁడును 'మందారా! వాని ప్రేముడి దలఁప నామేనఁ బులకలు వొడముచున్నవి. నేను గాకిచేఁ గబురంపినఁ జాలు నెచ్చటికి రమ్మనిన నచ్చటికి వచ్చి వ్రాలును. ఇంతకంటె నాపై వానికిఁగల ప్రేమకుఁ దార్కాణ మేమి కావలయును' అనిన విని మందారుఁ డచ్చోటు విడిచి పాతాళఖనికు నింటికిఁ జని వెనుకటియట్ల వాని నడిగిన వాఁడు ఒడలుప్పొంగ 'మం

దారా! ఆ వగకాని జగానిగనిగ లేమని స్తుతింతును. ఎంత ప్రొద్దు పోయినను నే నిద్రచెందునందాఁక నిద్రపోఁడు. ఉబుసుపోక కెన్నో మున్నెన్నఁడు వినని కథలను జెప్పును-పాటలు పాడును’ అన విని యందఱిమనంబుల సంతసంబుల నెఱింగి తనలోఁ దా నవ్వుకొని మందారుఁడొకనాఁడు చతురు నింటికిఁజని తన నోడికారంబున (మాటచమత్కారము) వాని నానందవార్ధిఁ దేల్చి ‘చతురుఁడా! నాకొక సందేహము గలదు. నీ సఖులు నలువురును వివేకులు. అందు నీ కెవ్వరియందు నిక్కంపు ప్రేమగలదు? దాఁపురంబుచేయక సత్యంబు వచింపుము’ అనుటయుఁ జతురుఁడు ‘ఓయీ! నీ వెఱుంగనివాని వోలె నడిగెదవేల? రాజతంత్రజ్ఞులకుఁ బ్రణయములకు నెంత యంతరము? మే మొనర్చు ప్రియములు ధనమునకే కాని యన్యంబునకుఁ గాదు. కావున నే నెవ్వనియందును దగులము గలిగియుండను. ఒకనిపైఁ గన్నువైతును; వేఱొకనిపై సైఁగ చేయుదును. ఇంకొకనిపైఁ జిఱునవ్వు చిలుకుదును. మఱి యొకనిపై మరులు పఱపుదును. తా రందఱు తమక తమక లభించినవాఁడనుగా ననుఁ దలంతురు. కాని నేను ధనమునక కూర్తును.’ అన మందారుఁడు ఔలే చతురుఁడా! ఏమి నీ చతురవాక్యములు! అద్దును పద్దును లేకున్నవే! నీ వర్థపాలున కెట్లు కూర్పవు? చెప్పుమన వాఁ డతనిని దన మృదుకరంబునఁ జఱచి నవ్వుచు నిట్లనియె.

మందారా! వానిని నచ్చికబుచ్చికలాడి- నిచ్చెనయెక్కించి తొలఁగఁబుత్తును. పిమ్మట నెమ్మదిగా నే నితరునిఁ బిలుతును. వాఁడు రత్నశుద్ధి యెఱిఁగినవాఁడు. కమసాలి కపటంబు తెలిసినవాఁడుకాన వాఁ డరుదెంచిననాఁడు నేను రత్నమయభూష

ణంబులను దాల్తును. దాన నాతండు సంతుష్టి చెందును. అన విని మందారుఁడు చతురా! సరే!. యది కపటంబైన నగుఁగాని మంత్రికుమారునితోడి నీ విహారంబుగూడఁ బ్రేమ లేనిదియే, యగునా? అదియెల్లు చెప్పుమన నాతఁడు మందారా! వాఁడు ప్రోడ. కావున వానిని మెల్లనఁ గళల నేర్పు మని యడిగి కళల నేర్చుకొనుచున్న వాఁడనుబోలెఁ గాలంబు వెళ్లఁబుత్తును. అన మందరుఁడు సరేకాని చతురుఁడా! పొరుగింటికిఁ బోయికూడ నీవు దండధారునిఁ బ్రేమింపనివిధ మెట్టిదో నాకు బోధపడకున్నది చెప్పుమన నాతఁ డిట్లనియె.

మందారా! నా మిత్రుఁ డొక చోరుఁడు గలఁడు. దండధారుఁడు వచ్చి వాని సాధనంబులఁ జూచెనేని పోరు తప్పదు. కాన దండధారు నిలుచోరనీక తలవాకిటి యిండ్లకుఁ దోకొని పోయి యోయీ! బలవంతుఁడైన చోరుఁడు నా యింటనున్నాఁడు. నేను నీకుఁగూర్చుట వాఁడు చూడరాదు. కాన నీడకు నిను వెంటఁ బెట్టుకొని వచ్చితినని నచ్చిక కూర్తును. అన విని మందారుఁడు సరి! సరి! అది యట్లైన నగుఁ గాని చతురుఁడా! పాతాళఖనికునితోడి నీ పొందు కపటంబే యందువా? యనిన నాతఁ డిట్లనియె.

మందారా! వాఁడు అరసికుఁడు. ప్రొద్దు గ్రుంకుతోడనే నిద్రపోవును. పైఁగా దొంగ. కాన వాని మేనిపై చేయూని వాఁడు మేల్కనుదాఁక నట్లయుండును. అట్లుకానినాఁడెల్ల పాటు హాని కలుగకుండునా? కావున నీ యుపాయంబు పన్ని యపాయంబు తలంగితిని– అనిన, మందారుఁడు అచ్చెరుపడి ఏమీ చతురుఁడా! రాజతంత్రజ్ఞులందుఁ గూరిమి యెవ్వరియందును లేదే యనఁ జతురుఁ డిట్లనియె.

చెలికాఁడా! కూరిమి లేదని పలుకనేరను. ఎవ్వరికైనను నెయ్యమొక్కయెడఁ జేరక తక్కదు. కపటపుఁ బ్రేమమాత్రము తఱచుగా నణఁగియుండును. నిక్కపుఁ గూరిమిమాత్ర మొక్కచో నుండును. కలవని వలవని ప్రియుని న్యెడఁ గలిగించుకొను వెఱపుగలిగిన తమ నెయ్యము వలఁతులు తాల్మిచే వెలిదోఁపనీయరు. అన మందారుఁడు సంతోషించి వెడలి చనెను.

తనకొఱకై యా చతురుఁడు ప్రియోపచారములు కావించి యర్థపాలనాదుల మనములు నేర్పుమతితో హరించెను.

కావున మనమును మనకొఱకై యిప్పుడు చంద్రవర్మకమిత మిత్రులమై యాతని కూఁతు నిటకుఁ దేవలయును. ఇదియ యిప్పటికిఁ గర్తవ్యకార్యము.

అని యిట్లు తన మేనయల్లుఁడు వినిపించిన నీతివాక్యము లాలించి యది మంచిదని లాలించి భాగురాయణుఁడు వెంటనె లాటదేశాధిపతియగు చంద్రవర్మ పుత్త్రికను దోడ్కొని రా నొక్కరుని బంపెను. వాఁడును హుటాహుటి నేఁగి చంద్రవర్మ కా వృత్తాంతంబును దెలిపి మృగాంకావళిఁ దోకొనివచ్చి యా సంగతి మంత్రికి విన్నవించెను. మంత్రి యందులకు మిగుల సంతసించి "మీ తమ్ముఁడు మృగాంకవర్మ వచ్చినాఁడు. వాని యునికికి నెల్లవిధములఁ దగిన మా మందిరమున వానిని విడియించితిమి" అని రాణికి వార్తనంపి యామె మనంబునకు ముదం బాపాదించి యా రాణి పరిచారికలలో దృఢవివేకయగు కళావతి యనుదానిని ఆత్మకార్యానుకూలనుగా నియమించి మృగాంకావళివిధం బెఱిఁగించి యక్కన్నియకుఁ జెలియలిపై

వర్తింపుమని యాజ్ఞాపించి కార్యభారమంతయు నామెపైఁ బెట్టెను.

అట్లు కార్యంబు చక్కంబడుటయు భాగురాయణుఁడు తన మనంబున్నఁ గొండొక విచారించి శిల్పులను రావించి, 'యభ్యంతర మందిరమున కావల దవ్వుల నొక్క రమ్య హర్మ్యము రత్నములతో నిర్మింపుఁడు. అది యదృష్టపూర్వము అశ్రుత చరము నై యుండవలయును' అని యాజ్ఞాపించెను.

వారు మంత్రియాజ్ఞ యాదలఁ దాల్చి నెలనాళ్ళ బిగియించిన గోడలును బాలగచ్చుచేసిన స్తంభములును జలధారా యంత్రములును గలిగి విశ్రాంతికి విడిదిపట్టైన యొక్క చక్కని మేడ నిర్మించిరి.

ఆ మేడజాడ యంతకుమున్నె యుంగని రాజు దానిఁ జూడనేగి యభినవంబును మనోహరంబును నగుట నంద నిద్రించుచుండెను. అంత నొక్కనాఁడు రాణి దాదికిఁ బుత్రియైన మేఖల యనుదాసి రాజు చెలికాఁడైన చారాయణుఁ డను విప్రునితోఁ గలహించిన విధ మెఱంగి రత్నసుందరి పరిచారిక లగు మకరందిక సుమతి సుకుమారిక యనువారు మూవురు నొకచోఁ గూర్చుండి యేకాంత గోష్ఠి నుండుచుఁ దమలోఁ జారాయణ మేఖలా వివాద ప్రసంగంబులగు మాటలాడుచుండ నందు సుమతి యి ట్లనియె.

చెలులారా! మొగమోట, గొప్పఁదనము, అడఁకువ, తగవు, ఔచిత్యము మెలవు, పెంపు, తాల్మి మున్నగు సుగుణంబులున్న పరిజనము లెకదా నగఖులలోపలఁ దిరుగవలయును. కంటిరిగదా! చారాయణమేఖలుల పోరు తీరు. వా

రించుకయు ముందు వెనుకలు యోచింపరైరి. రాజు నెదుటఁ బడినచో వారిరువురకు నిట్లు కలహంబులు కలుగునా? నైజగుణంబగు రాజసము గప్పి యప్పటికిఁ బ్రజతోఁ దిరిగినంతమాత్రమున రాజులు సాధులని తలంపరాదు. క్షుద్ర కార్యములకై చలమునూని ప్రజలు తమలోఁ దాము వృథా పోరికొందురు. అదికనిన రాజు ఉత్తలుఁడైనచో (తొందర పాటు గలవాఁడు) వారు వాదంబులఁ బొలిసిన శశ, కపింజల ములువోలెఁ జెడకుందురా?

వినుఁడు కథ వినుతును.

నర్మదానదీతీరంబున గల యొక్క తరుకుంజమునఁ గపట ధార్మికమగు పులి యొక్కటి కాఁపుర ముండెను. అది తన హింసాకర్మ మెరు తెఱుంగకుండ వర్తింపుచునుండ నొక్కనాఁ డవ్వనంబుననున్న మృగంబులెల్ల దానిఁబెద్దయు నమ్మి తమ్ముఁ బరిపాలించుటకై వేఁడిన నదియు హింసాధర్మంబున దండనం బొనరింపఁగాని, న్యాయాన్యాయంబులు నిర్ణయించి మిమ్ముఁ దగుభంగి శిక్షింపఁ గలవాఁడ ననియె. అవ్విధంబట్లు చెల్లు చుండ నొక్కనాఁడు శశ, కపింజలము లొక్క బొరియకై వివాదపడి వచ్చి పులికిఁ దమ యిరువుర తెఱంగునుఁ దెలుపుటయు నా వ్యాఘ్రంబు వానితో 'మేము చాల ముదిసినారము. కన్నులు మున్నువోలెఁ గానము. శ్రవణములు దూరమును విను శక్తిలేదు. కానఁ గదియంజనుదెంచి మీ కార్యంబు చెప్పు' డన నవి తెలివిమాలి డాయంబోవ వెంటనే పులి ముందటికాళ్ళంగొని కుదేటిని, గొంతుకనొక్కి కపింజలమును జంపి భక్షించి యమందప్రీతి నొందెను. తెలివిమా

లినవారు కొలఁదికార్యంబులను ఘనములుచేసి చలంబుతోఁ బోరికొనిరేని నది రాజు చెవులఁబడ్డ నిరుదెఱఁగులవారికిఁ జాల కీడు గలిగించును. దాన సందియము లేదు.

అని యిట్లు సుమతి యెఱిఁగించిన కథ విని మకరందిక యి ట్లనియె.

అక్కలారా! పో రెన్నఁడు నొప్పదు. అల్పులపోరాటము ముదిరి యంతతోఁ బోక తొండలు పోరఁగా జనులకుఁ జెట్ట పుట్టినట్టులు విపత్తులకు నాధార మగును. ఆ క్కథ వక్కా ణించెద వినుఁడు.

మాణిక్యసేనుఁడను రాజొకఁడు గలఁడు. అతఁడు జైనుల యెడఁ జాలభక్తిగలవాఁడు. వాని పురంబునకుఁ జేరువ నొక్క యగాధసలిలమగు తమ్మికొలను గలదు. దానిచెంత వారికిఁ గోరినయట్ల వసతు లేర్పఱచెను. సకలపదార్థములు ఫలపఱచెను. అందు జైనులెల్ల నుల్లంబులు పల్లవింప ననుష్ఠానవిధి నడపుకొనుచుండిరి. ఇట్లుండ నొకనాఁడచ్చటి పద్మవనతీరంబు ను పాంతంబునఁ గల పొదరింటియం దొక్కచోటఁ దొండలు దండిగాఁ గాటులాడుటయు నం దొక్కటి తక్కటిదాని విశ్రాంతి కోర్వక పాఱివచ్చి యేనుఁగులుగల యాకొలనిలో దూఁకి వెంటాడివచ్చు తొంటితొండవలని భయంబు పెంపున యందలి యొక యేనుఁగువీనున దురదుర దూఱెను. దూఱియు దూఱుటతోడనే యా యేనుఁగు ఘూత్కారము చేసి తొం డము విదులుచుఁ దామరతంపర వీడి గట్టెక్కి ఘీంకారం బులఁ గావించుచు తొండంబు మాటిమాటికి నలుకెలంకులకుఁ ద్రిప్పుచు బయలు రొప్పుచు మ్రాఁకులు పీకుచుఁ బొదలుఁ

గూల్చుచుఁ బోటి పాటి యున్మత్తునివలె జైన నిలయంబులు సొచ్చి, కొమ్మలతో గోడల నూడఁబెఱికెను. గృహమ్ముల వీటతాటమ్ముగ నీవలావలఁ బడవైచెను. అదికని జైన మునులు కొందఱు వస్త్రములు గుంచియలు విడిచి మొగంబులు పుల్లగిల్ల నుల్లంబులు తల్లడిల్ల నడునడు నడంకుచుఁ దలకోదారిగ పఱువిడిరి. కొందఱు నోళ్లెండి కాళ్లు దొట్రువడ 'దారితెన్ను' దోఁపక కుయ్యో మొఱ్ఱో యని యఱచుచుండ వేదండము వారిని జేరి కొమ్ములఁ జిమ్మియుఁ బదంబులఁ జిదిమియుఁ, దొండమునఁ జెండియు వధింపఁగాఁ బుడమియంతయుఁ బీనుఁగుపెంట యయ్యెను. నెత్తురులు గాలువలయ్యెను.

అట్లు జైనుల వధించి యది మది మదిలోలేక కడమపడిన వసతులఁగూడఁ బడఁద్రోచి, మరలఁ గొలను సొచ్చి తామరల నెల్ల భగ్నము గావించి దరికివచ్చి తొండమునిండ జలము పూరించి యోరగాఁబెట్టి చెవిలో నా నీరము గురిపించెను. వెంటనె సరటము (తొండ) తల్లడపడి బైటఁబడెను. ఏనుఁగు కూడ సంతసించెను.

సరటకలహంబు చేరువై సమసిన వారణమువలెను జైన కులముమాడ్కిని, కాసారమట్లును అల్పులొనరించు దుష్కలహంబు చేరువైయున్న ఘనులకుఁగూడఁ జేటు చేకూర్చును.

అని మకరందిక యెఱిఁగించిన కథవిని కొనియాడి సుకుమారిక యిట్లనియె.

అప్పలారా!

అలుకయు, మదమును, గర్వమును గారణముగా నకారణ

విరోధమును జనుల పనులకు మధుబిందుకలహములవలెఁ గూడి రానికీడు మూఁడును- వినుఁ డాకథ వినుతును.

లొటరాజు నగరంబునఁ దేనె నమ్ముకొనుటకై బోయ పల్లెను జరించువాఁ డొకఁడు బిందెనిండఁ దేనె నిడికొని వచ్చి యాపట్టణమున నొక యిరుకుసందులోఁ దిరుగుచు బిక్క చూపుల నాలుగుదిక్కులు నేదేనియుఁ జూచుచు నరుగు చుండెను. అంతలో నొక యేనుఁగు మదాంధమై రాఁగా బురజనులు భీతచిత్తులు పఱవఁ దొడఁగిరి. అదిచూచి వాఁడు భీతుఁడై కాళ్ళువడఁకాడ పరువెత్తుచు దడదడవడఁకు కాళ్లు నిలువఁ ద్రొక్కఁజాలక జాఱి మ్రొగ్గతిలఁబడఁ బొఱుటయు మూఁపునఁ దాల్చినకుండ తొలఁకి మధుబిందువొక కొంత భూమిపై నొలికెను. ఆ తేనెబొట్టున కచట నీఁగలు ముసి రెను. వానిబట్టుట కొకచెలఁది యచటికిఁ జేరెను. ఆచెలఁది నొకబల్లి మ్రింగెను. ఆబల్లి నొకపిల్లి తినెను. ఆపిల్లి నొక వేఁటకుక్క కఱచెను. ఆకుక్క నాపిల్లి కోపంబుదీపింప బొడిచెను. ఆకుక్క రాజుగారిదగుటచే వేఁటకాండ్రాపిల్లిని గొట్టి చంపిరి. తమపిల్లిని మృగయులు చంపిరను కోపంబున నావాడవా రాకుక్కను తఱిమి తఱిమి చంపిరి. అదికని వేఁట కాండ్రు రందఱు నేఁగి యాకథయెల్లఁ దమరాజున కెఱింగించిరి. అదివిని రాజు తగవూహింపక యకారణ వైరమూని, యా యూరివాడ జనంబులనెల్ల జంపుఁడని తనయోధుల కాజ్ఞా పించెను. రాజునాజ్ఞచే యోధులు తమపై దండెత్తుట యెఱిఁగి సేవకులుగాని ప్రజలెల్ల నొక్కటియై నానావిధాయుధో పేతులై, మహోద్రేకంబుతో నార్చుచు రాజసేనను దాఁకిరి.

ఇరు తెఱంగుల సేనలకును రిత్తకురిత్తచలంబు పెంపున ఖండనము దండిగ జరిగెను. నేలయంతయు పీనుఁగుల ప్రోవయ్యెను. కండలు ప్రేవులుగలిసి నెత్తురు కాలువలై పాఱెను. కుండలంబులతోడి శిరస్సులు వీధులలో గుప్పలుగట్టెను.

చిన్న కార్యమునకై కూడఁ గుమతులు రోసంబునూని మూర్ఖత్వముతోఁ బెనఁగి లాటనృపతి పోరులువోలెఁ గాసిని గాంతురు.

అని చారాయణ మేఖలాకలహంబు లుగ్గడించి కలహంబు లింత తెస్సయకనే యనుచు వారు మువ్వురు తమదారిఁ జనిరి. అంత నొక్కనాఁడు భాగురాయణమంత్రిచే నుపదిష్టయై వివేకవతి యను కళావతి రాజసఖుఁడగు చారాయణుతోఁ జెలిమి కావించి మేఖలను బరిభవింప నొక్క యుపాయ మొఱఁగించెను. వాఁడా కళావతి చెప్పిన చొప్పున మేఖలతోఁ గపటసఖ్యము నొనరించి నమ్మిక పుట్టించి యొక దాసికిఁ బురుష వేషంబు వేయించి మేఖల నాపురుష వేషధారికిఁ బెండిలి చేయించెను. కొంతవడి కది యెఱిఁగి మేఖల భంగపాటును నస్నిలోఁబడి మనస్సు వేఁగిపోవఁగాఁ జేల చెఱంగున ముసుంగిడి యరిగి రాజుతో సరసాలాపంబులఁ దేలుచున్న రాజ్ఞి యడుగులఁబడి వెక్కి వెక్కి యేఁడువసాగెను.

అదికని రత్నసుందరి ఏమే మేఖలా! నిన్న రాత్రియేకదా పెండ్లియైనది. నీ పెండ్లికై తగినవారి నెల్లఁ బుత్తెంచినిగదా! నేఁ డిదేమి? యిట్లు వాపోవుచున్నావు? నీవిచార కారణంబు తెలియునంతకు నాడెందంబు కొందలంబు నొందుచున్నది చెప్పుమనునంతలో రాజు కనుసైఁగ నందుకొని చారాయ

ణుఁడు మేఖలా! నిన్నరాత్రి కళ్యాణంబువచ్చి పెండ్లి యాడితివి. నిన్నుఁగట్టిన నీ త్రాడు నేఁ డేమాయెను. ఇట్లు పొరలి పొరలి యేడువఁ గారణం బేమి? చెప్పుము? నీమగఁడు నీకు సరిగాఁడా! నేఁజేసిన పరిణయసంధానము నీకు నచ్చలేదా? కారణమేమి కానోపు? చెప్పుము అనిపలికి పక పక నవ్వ, రాజమహిషి 'మేఖలా! యేల యేడ్చెదవు. లే. జరిగిన వృత్తాంతమేమియో యున్నదున్నట్లు చెప్పుమన నది యేడ్పుడిగి లేచి మొగమువాంచి చారాయణుఁడు తనతోఁ గపట సఖ్యం బొనరించి తన్ను బంధుజనల సమ్ముఖమ్మున వివాహోత్సవమును జూడవచ్చిన రివాయెదుర సరివారిముందఱఁ బరిభవించిన తెఱంగు నీరెలుంగుతో వెక్కుచుఁ జెప్పి క్రమ్మఱఁ గన్నీరు మున్నీరుగానించఁ దొడంగెను. అది కని రత్నసుందరి తన చెలికత్తెకుఁ జారాయణుఁడు చేసినతప్పు రాజుతప్పుగ నెంచి మోమడ్డంబుగఁ ద్రిప్పి యపాంగభాగములు తెప్పలఁగప్పెను. అదికని కేయూరబాహుఁడు. మనంబున ఘనంబుగ వణఁకఁ దొడఁగెను.

## 3

అంత రత్నసుందరి మేఖలంగాంచి 'ఓసీ! ఏల విచారింతువు. ఇది విదూషక మంత్రముగాదు. ఎల్లవియు నాకెఱుఁగవచ్చెను. లెమ్ము. పోద'మని యామెకరంబు తన కరంబున సూఁది పట్టుకొని, మనంబును బిఱుందును నల్లలనాడ నలుక తొలఁకుచుండఁగా నిజనివాసంబున కరుగఁ దత్పరిచారికలగు సుమతీ సుకుమారికా మకరందిక లోకచోటం

గూడి రహస్యగోష్ఠి యొనరించుచు నవసరంబున సుమతి యిట్లనియె.

చెలులారా! చూచితిరే మేఖల చేలతనంబు! క్రిందు మీఁదుగానక తొలుతఁ జారాయణునితోఁ గయ్యంబునకుఁ గాలుద్రవ్వనేల? పిదప నెయ్యము సలుపనేల? ద్రోహులతో విరోధానలము రాఁజవెట్టనేల? పిమ్మట యుక్తిహీనతతో స్నేహంబు చేయనేల? మనసులు కలియని మైత్రి యుపహాసంబుగనుండుఁ గాని మంచికలాగున నెట్లుండును? బలవంతుఁడు, పగవాఁడు, ఖలుఁడు నగువాఁడు కపటవాక్యంబులఁ గలియవచ్చినయెడల గలిసికొనిన వారవశ్యము కీడు చెందక మానరు. నేడ్పుతో మేఖలయెడఁ జారాయణుఁడు చేసిన చేఁత తొల్లి కప్పలు కపటోక్తులచే సర్పమును జేరి దాని కెగ్గుచేసి నట్లున్నది- వినుఁడు. ఆయహి భేకోపాఖ్యానము వినుతును.

అల్లిబిల్లిగ నల్లుకొనిన పూఁదీఁగెలతోడను, మధుర ఫల భార వినమ్రములైన చెట్లతోడను, మూఁకలుగట్టిన పోఁక మోకలతోడను, వాలుమెకంబుల జాలంబులతోడను వర్ణనీయంబై వింధ్యాచల పార్శ్వకాననము కనుపండువు చేయుచుండును. ఒక్క యుగసంధియందు ద్వాదశ వర్షక్షామంబుపట్టెను. అక్కాలంబునఁ బచ్చిక లెచ్చటను లేక యెండి మండిపోయెను. నేల పాతాళముదాఁకఁ బగిలెను. బిలములు వ్రయ్యలయ్యెను. హీనజంతువులు నిలువనీడ లేక యల్లాడెను. చెల్లెండిపోయెను. గాలిదుమారములు రేఁగి లోకంబు నాకులపెట్టెను. ఆఁకలిబాధ కాఁగలేక ప్రజలంద ఱలార్చిరి. ఎల్లప్రాణులు నీరువట్టున నట్టుడికిపోయెను. కార్చిచ్చు

పేర్చి మృగముల నేర్చెను. ఆపద లావహిల్లెను. వట్టిపోయిన డొక్కలు పెక్కులయ్యెను. నిప్పులుబొగ్గుల ప్రోవులు దుస్సహమలయ్యెను. అట్లు స్తవ్యస్తమైయున్న యాయడవియం దొక నూయిగలదు. దాన ననేకంబులు కప్పలు బహువర్ణంబులు సుహృద్భ్రాతృ పుత్రపౌత్రయుతములై మహావేగుఁడును మండూకంబును దమకు రాజుగాఁ జేసికొని సుఖంబుండెను. అంత భయదర్శమను నొకపాము ప్రియబంధువులెల్ల లయమందఁగాఁ గంతాశ్రయజీవనమై మండూకనినాదము నాలించి నిండుమోదంబు నొంది నీరుండనిచోఁ గప్పలుండవని తలంచి వానిని గదియం జనుదెంచి నిండుజలంబులనుండిన యానూయిఁగాంచి సంతసించి నా యాఁకలిడప్పిక లిప్పుడఁ బోకార్చుకొందునని తలంచి చెఱవెడలఁ దెరవుగానక దరిని నిలిచి పరిమిత పరిజనవృతుఁడై తన యిరవుననున్న మండూకనాథునిఁ గాంచి దేవా! భేకకులాధినాథా! నన్నుఁ గరుణాదృష్టిని జూడుము. నోరెండి పోయెడిని. ప్రాణంబులు నిలువవు. నీ కాళ్ల ప్రాలెదనన్న దారి గానకున్నాను. దుఃఖంబున మునిఁగియున్నాను. నన్ను నీకడకు రావించుకొనుము. నీవారితోఁ గలిపికొని రక్షింపుము. తెలివిమాలి మాపెద్దలు మీపెద్దల కెగ్గుచేసిరి. నన్ను నీపాదసేవకునిగాఁ జేసికొనుము. తొల్లి మావారు చేసినయెగ్గునకుఁ బ్రాయశ్చిత్తముగా నీకాళ్లు పట్టి బ్రతికెదను. మన్నింపుము. ఓ చారుతరమూర్తీ! మండూకచక్రవర్తీ! కప్పలు పాములకొకప్పుడు భయపడిన మాట వాస్తవము. కాని యిపుడు నీప్రతాపమును మావారు విని గడగడ లాడుచున్నారు. నీపేరన్న వారికి సింహస్వప్నముగా నున్నది. హనుమంతునిఁ బ్లవంగమందురు. నిన్నును

నందురు. ఇంద్రుని హరి యందురు. నిన్నును నందురు. ఆహా యెట్టికీర్తిని గాంచితివి. నీయట్టిజెట్టి స్నేహంబు దొఱకుటకు నేనెట్టి పుణ్యంబు చేసితినోకదా! యని యిట్లు తన్నా పాము నుతియింపఁగా విని యుబ్బి మండూకము పామును గని క్షణమాఁగుము. నామంత్రుల యనుమతి నొంది నిను రావింతును. అని తన యిష్టమంత్రుల రప్పించి వారికి ఆపని యెఱిఁగించి నవి పాములపొత్తు మనకేల? యిది యేమంత ఘన కార్యమని చెప్పవచ్చితివని సర్పబాంధవము వీడని తమతేని మోముఁజూచి శ్వేతుఁడను మండూక మిట్లనెను. కుజనుఁడు తనకు నెడరుదొడరి నపుడు తన్ను మాలనికంటె నధమునిగా నెన్నికొనును. ఆకష్టమునుండి గట్టెక్కఁగానె చక్రవర్తినని తలంచుకొనును. వానికి సిగ్గునకుఁ జాలదవ్వు. సుజనుచెలిమి శిలాక్షరము. అలుక జలాక్షరము. కుజనుల మైత్రి జలాక్షరము. అలుక శిలాక్షరము.

అనినంత గృష్ణరూపంబను మఱియొక దర్దురం బిట్లనియెను.

ఆర్యా! దుష్టులు తమ చెడుగులయెడఁ బుట్టంధులు. ఆత్మస్తుతిపరాయణులు. నిజరహోజాగరూకాత్మకులు. పర దోషములఁ బరికించు దివ్యచక్షులు. పరప్రజ్ఞాసహిష్ణులు. పరకాంతా పరధన హరణోద్యోగులు. అట్టివారినిఁ జేర నిచ్చినవారు కాకమును జేరనిచ్చిన హంసములువలెఁ నిడుమలు గుడువక మానరు. వినుఁడు. ఆకథ వినుతును.

ఒక పర్వతముమీఁద నిండు కొల నొకఁ డుండెను. అందు రాయంచలు స్వేచ్ఛగాఁ బగలెల్ల విహరించుచు బ్రొద్దుగ్రుంకఁగానే పాపాత్ములకుఁ బ్రాఁక నలవికాని యొక

యున్నతోన్నతమగు గండశిల నాశ్రయించి యందు రేలెల్ల సుఖనిద్ర చేయుచుండును. వానినిబట్టి నెంచి యొకబోయ యత్నించి తేఁటిచూడలేక యెందేవరిగెను. అంత నొకకాకి యచటికిఁబోయి వాని కలరవము విని డాయం బోయెను. దానిఁగాంచి హంసలు 'కాకమా? యెచ్చటినుండి యెచ్చటి కేగెదవు? ఏమిపనిగల్గి యిచ్చట నిల్చితివి?' అని యడుగ నది 'అంచలారా! ఆయూ పదార్థంబు లేటికొని తిన నందందుఁ దిరుగాడితిని. కడుపు నిండినది. యింటికిఁ బోదమన్నఁ బ్రొద్దు చాలదు. కావున నిచ్చట నాఁగితిని. ఇదియ నాయిచ్చటి యున్కికిఁ గారణము'. అన హంసములన్నియు "అగుఁగాక యట్లే నిలువుమన" విని యందు సుగుణుఁడైన మతిమంతుం డను హంస యిట్లనియెను.

"అంచలారా! దీని స్వభావమూ క్రూరము. తిండియూ మైలకూళ్ళు. పక్షులలోఁ గాకికన్నఁ జండాలుఁడు లేఁడు. ఇది మనకడ నీరేయి నిలువఁదగదు. నిలిచిన మనకుఁ గీడు మూఁడును. నేఁడు రేపటిలో రాకున్నను గాలముమీఁటిన పిమ్మటనైనను గీడు రాకమానదు. నామాట తథ్యము. నమ్ముఁడు." అనుటయు నామాటను గీటునఁబుచ్చి కొన్ని తరుణమరాళములు 'మతిమంతుఁడా! యేల యింతగా వాదింతువు. ఈ కాకియొక్కటి యొక్కరాత్రి యిక్కడ నున్నంత మాత్రమున నేమి కీడు దాఁపురించును. ఇది నీ హృదయ దౌర్బల్యముగాక యన్యంబుగాదు. అయ్యో నీ తెలివితేగలు తిన నిఁక నూరకొనుము. బుద్ధులు పెక్కులు గలచినవారికి భయమెక్కుడనుట నిక్కవమయ్యెను. ఈ కటికిచీఁకటిలో నిది యిప్పుడెక్కడికిఁబోవును'. అని పలికి దానినుండఁ బనిచి

యభీష్టఫలంబుల నొసంగ నదియు నందు వసియించి యచ్చట రెట్టఁ బెట్టి (వేసి) సూర్యోదయముగాకమున్న తనదారిని దా నరిగెను. దానిరెట్ట రాల నడుమం బడెను. ఆరెట్టలో మఱ్ఱి విత్తుండుటఁ జేసి యందొక వటభూజ ముద్భవించెను. అది నానాఁటికిఁ బెరిఁగి పెద్దదియై నలుదిశలు బ్రాఁకెను. పది యేండ్లు చనునంతకు దాని యూడలు చిలువలు పలువలై యధిత్యకా (కొండమీఁది నేల) తలమంతయు నావరించెను. అది గాంచి కిరాతుఁడు సంతసించి యాయూడల నూఁతగాఁ గొని చెట్టెక్కి యందు వెల్లికడలఁ బన్ని చల్లఁగా దానచ్చోటు విడిచి చనెను. అంత సూర్యుఁ డుదయాద్రిఁ జేరెను. హంసములు జలజాతవనంబులఁ గ్రీడించనాని తెటాలుసవచ్చి వ్రాలి యుచ్చులఁ జిక్కి దిక్కుమాలి కుందఁ దొడంగెను.

అది కని మతిమంతుఁడు 'మిత్రులారా! చూచితిరా? మనకెట్టి పాటులు వాటిల్లెనో! వృథాహంకారముతో నామాట నాఁటిరాత్రి మీరు వినరైరి. పైపెచ్చు నాతో వాదులాడిరి. ఆ కాకిరెట్టలోనుండి పుట్టినదే కదా యీమఱ్ఱి. యూడలు పాఱి పెరిఁగినది. ఈ యూడలనుండి పైకెగఁ బ్రాఁకి కాదె బోయఁ డీవల పన్నిపోయెను.

తగువాని పలుకు లాలించి పాలించుట, తగవెఱుఁగి యడచి పడకుండుట, తమవారితో సగుణత్వము గొనుట యుత్తముల లక్షణము. లాఁతివిధము అధమలక్షణము. అనుటయు నంచలెల్ల నొక్కటై బిక్కమొగంబులతో మతిమంతున కిట్లనెను.

మహాత్మా! నీమాట దాఁటుటచే మేమిట్టిపాటుల పడితిమి. బుద్ధి వచ్చినది. క్షమింపుము. ఏ యుపాయంబుచేతనైన నీయుపాయంబుఁ గాపుకొన వీలగునేనిఁ బాపి హితులను బంధులను నిన్నును గాచికొమ్ము. నీయాజ్ఞఁ దలదాల్చి నీకు దాసులమై కొలువఁగలము. అనుటయు మతిమంతుఁ డిట్లనియె.

హితులారా! తమలో నన్యోన్యవశత్వముగల బంధువులాపదలనెల్ల నుపాయంబుతో మెల్లగాఁ గడతురు. కమఠములైకమత్యము చేతనేకదా గరుడబాధను గడచినవి. మీరు భయపడకుఁడు. ఆకథ వినుఁడు.

సముద్రతీరమునఁ గొన్ని కూర్మములు సంచరించుచుండెను. గరుత్మంతుఁ డుగ్రుఁడై వానిని బ్రతిదినంబును భక్షింపఁ దొడఁగెను అట్లుండ నొక్కనాఁడు ఒక్క తామేటి మేటి యాపక్షిరాజును గాంచి మహాప్రభూ! "మాబంధువర్గమంతయు మీవాతంబడి నిరవశేషంబయ్యె. ఇఁక నేనొక్కండన మిగిలితిని. మీబారినుండి తొలఁగి పోఁజాలను. మీఁదనేమిచేసినను సరే! నాదొక్కమనవి కలదు. అవధరింపుము. మన మిరువురము నొక్కపన్నిదము సలుపవలయును. అది యేమి పన్నిదము చెప్పుమందువా? యాగ్రహింపక వినుము. జవసత్త్వోత్సాహంబులతో నీవాకాశంబునఁ బరువెత్తుము. నేను సముద్రమునఁ బఱతును. నీకంటె నేను ముందుగాఁ బరువెత్తఁగల్గితి నేని నీవెన్నఁడును మమ్ము భక్షింపకుము. నిన్నుఁ గడవఁజాలక నేనోడితి నేని నీవు మాకులంబునెల్ల నాహారముగాఁ గొనుము. ఇందుల కీవొడంబడెదవేని నొక్కనాఁ

డిచ్చుటకి విజయము చేయుము" అనిన వైనతేయుఁడట్ల చేయుదునని యొడంబడి వెడలిన యనంతరంబ కచ్ఛపము (తాఁబేలు) తన చుట్టంబుల నందఱి నొకచోఁగూర్చి తాను గరుత్మంతునితో నొడఁబడిన చంద మంతయుఁ జెప్ప నవి యెల్ల "నోయీ నినుఁ గడచిన మతిమంతులు మనలో లేరు. నీవేది పని చినఁజేయువారము. చెప్పు మన" నది సంతసించి యి ట్లనియె.

"చెలులారా! మనమందఱము సముద్రతటంబు నీరంబులఁ జొచ్చి యందందుఁ బదిమందిచొప్పున వసియింతము. పక్షి రాజు పఱచునెడ నాతని కాముందటివాఁడు తాను ముందు న్నట్లు కానఁబడవలయును" అని యొడఁబాటు చేసికొని యవి యెల్లవియు సముద్రమంతయుఁ దామయై బహుయోజనం బులుఁదాక నిలిచినవి. పన్నిదము సఱచిన తాఁబేలుమాత్రవ తన తొంటిచోటుననె నిలిచి గరుడునియాగమనంబు ని క్షించుచుండెను. అంత గరుడుఁడవ్వలనికి వచ్చి కూర్మంబును బిలిచి పఱవఁ దొడంగెను. వారిధిపైఁ దాఁబఱచుచుఁ జని గరుత్మంతుఁడు తాఁబేలు వెనుఁబడియుండునని, తలఁచి పిలు చుటయు, నోయని పలుకుచుఁ దోయధిలో కమఠము తోఁచు టయు ఖగపతి వాయువేగంబున మఱియుఁ బఱచి కూర్మం బును జీరిన (పిలిచిన) ముందున్న తాఁబే లోహోయని పైకి లేచెను. అదికని తార్క్ష్యుఁ (గరుడుఁడు) డాశ్చర్యచకితుఁడై యందుండి ముందునకుఁ బఱచి ముందటియట్ల పిలువ నవి ముందఱ నంతంతఁదోఁచి పిఱుఁదులు ముందఱఁగా జేసి పక్షి రాజును గెలిచెను.

గరుత్మంతుఁడు తన యోటమికి లజ్జితుఁడై "యిఁక మీకెందును నెగ్గుచేయను. ఈసిగ్గు నాకుఁ జాలు" పొండు. సుఖంబుండుఁడు అని వెడలిన గచ్ఛపమ్ములు ముదంబునఁ బొందెను. అట్లగుటఁ బరస్పరవశ్యులగు బంధువు లాపదఁ గడవవచ్చును. ఇంకనైన నాపలుకు లాదరించెదరేని వినుం డని మతిమంతుఁడు మఱియు నిట్లనియె. "మన కంఠంబులఁ దగులుకొనిన యీయురు లూడిచికొను యుక్తి లేదు. శక్తియు లేదు. కాని చావకుండనుం డుపాయ మొకంటుగలదు. ఎట్లంటి రేని వినుండు. 'వేఁటకాఁడే తెంచి యురుల సరసికొనువేళ మనమందఱము చచ్చినవానివలెఁ బడియుందము. వాఁడు వచ్చి మనలఁజూచి యుపగతప్రాణులముగాఁ దలఁచి విడిచి పుచ్చును. అట్లతఁడు డిగ్గవిడిచి చనునప్పుడు మనము రివ్వన నెగిరి పాఱిపోదము' అనుటయు మరాళములన్నియు నిది లెస్స మతంబని నిశ్చయించి యమ్మతిమంతు నుపదేశంబున నట్ల యుండునంత వెల వెల వేఁగుటయు (తెల్లవాఱు) బోయువచ్చి పక్షిగణంబు చచ్చిపడియుండుటఁ గాంచి ఆశ్చవడి వానినెల్లఁ గ్రిందఁ బడవైచెను. ఒకఁడొకఁడు డిగ్గనైనఁగా నవియెల్ల ప్రోపుగట్టి సంభ్రమంబునఁ బాఱెను. మతిమంతుఁడు మాత్రము కడపటి శాఖయందురియందుఁ జిక్కియుండెను. తమప్రాణముల తీపిచే నవి మతిమంతుని మాటయే తలఁ పయ్యెను. బోయ యెగిరిపోయిన పక్షులఁగాంచి ముండ పుటుఁగులు నన్నింత మోసపుచ్చెరా యని యలిగి మతి మంతుని డాసి దానిమెడ నులిమి చంపెను. హంసములకు బుద్ధిగఱపిన మతిమంతునివలె మతిధృతి లేని వెడఁగులకు మతి గఱపిన సుమతికిఁ బ్రమాదము వాటిల్లును. చూచితిరా!

యొక్కకాకి తమ్మొక్కరేయి చేరిన మాత్రమున మతిమంతుఁడట్లు హతుఁడయ్యెను. తక్కఁగలుగు హంసలు దుఃఖాక్రాంతములయ్యెను. కావున నీసర్పము మన యావాసము చేరెనేని దుఃఖాతిశయంబున మనము ద్రుంగవలసి వచ్చును. కనుక దీనికిఁ ద్రోవ యెఱింగించెను తలంపు దొఱంగుము. (విడువుము). కరుణాతిరేకంబున నీ వుపకారము నితనికిఁ గావింపఁ గడంగినను బాత్రాపాత్రత లెఱుంగవలయును. కుజనులు ప్రత్యుపకారంబులు చేయఁజాలకయ సుజనులపై దోషంబు లారోపింతురు. కాకులు తమ కాశ్రయమిచ్చిన నీరుకాకుల కల్లైకదా కావించినవి. మీకాకథ వినుతును వినుండు.

పూర్వకాలంబునఁ గోసలదేశంబును ధారాసనుఁ డను రాజు పాలించుచుండెను. అతఁడు నీతిదూరుఁడు ధర్మబాహ్యుఁడు. కావుట నతని రాజ్యమందలి ప్రజలు కడగండ్లు పడుచుండిరి. వాని దుష్పరిపాలనము కారణముగాఁ గఱవు కలిగి పల్లెలన్ని ఫెళ్ళున వేఁగి పోఁదొడఁగెను. ఆ పల్లీపట్టణ భాగంబు లాధారంబుగ బ్రతుకు కాకంబులన్నియు నొకచోఁ గూడికొని ఇందు ముంగిళ్ళ నొంపును నెండువులు (ఎండఁ బోసిన ధాన్యము) లేవు. ఉన్నవారైనను నెంగిలిమెతుకులు సల్లుట మానుకొనిరి. బల్యాన్నములా కన్నుల కెన్నఁడును గానవచ్చుట లేదు. ఇంక నిచట మనకు నుదురపోషణము కాదు. ఎందేఁజని కడుపులు కాచికొనుటయ కార్యము అని నిశ్చయించుకొని తమ దేశమును విడిచిపోవుచుఁ గొంత దవ్వరుగునంతలోఁ ద్రోవ నొక్కచోఁ గాసారం బొక్కటి కానఁ

బడెను. అందలి నీరుకాకులు వీనినిగాంచి స్వజాతి బాంధవంబునఁ దమయున్నెడకుఁ దోకొనిపోయి తామరపూలచేఁ జల్లనైన తియ్యనీరు డప్పికదీఱ వానికిఁ ద్రావనిచ్చి పిమ్మట రుచిమంతంబులగు మీనంబుల నొసంగ వానిం దిని యాఁకలి చల్లార్చుకొని యద్దినరాత్ర మందేయుండి వేకువ లేచే కదిలి పోఁగడంగఁ గని నీరుకాకులు 'మీరెచ్చటికేగెదరు? మీచను పనియేమి?' యని ప్రశ్నింప నవి 'మా దేశంబు క్షామంబున నలఁగుచున్నది. ఆహారంబులు కొఱయయ్యెను. అది కారణంబుగాఁ బండిన భూములకొండుకడకుఁ జనుచున్నాము'. అనుటయుఁ గారండవములుఁ (నీరుకాకులు) మేముండఁగా మీరొండుచోటుల కరుగనేల? ఇచ్చటనే నిల్వుఁడు. ఈచెఱువెన్నఁడు నింకిపోదు. ఇందు జలచరములు వలసినన్ని యున్నవి. మీయిచ్చవచ్చినన్ని తినవచ్చును. అనిన విని కాకులు 'అన్నలారా! మేము మీవలె నీఁదఁజాలము. కావున మాయుదరపోషణ మిచ్చట చేసికొనుట కష్టము. దానంజేసి యొండొక తావునకుఁ బోవుదుము. కాదని వాదులాడక మా ప్రార్థన మాదరింపుఁడు. అనుటయు నీరుకాకులు 'ఔ నది నిజమే కాని మీరాహారమునకై యల్లాడ నక్కఱ లేదు. అంగలార్వ నక్కఱలేదు. ఇక్కొలనియొద్దున నిలువుఁడు. మేమే యేమియుఁ గొఱఁతపడకుండ మీకు మీనాద్యాహారంబు దెచ్చిపెట్టువారము. అనుటయు నవి యియ్యకొని యందే యుండెను. కారండవములు తెచ్చియిచ్చు మత్స్యంబుల నాప్యాయనంబుమీఱ మ్రింగుచుండెను. తామరపాకుల నిర్మింతంబులైన నికుంజముల (పొదరిండ్ల) శయనించి చల్లని పిల్లగాలు లుల్లంబులు పల్లవింపఁజేయ సుఖించు

చుండెను. కలకాలం బిట్లచ్చటఁ బుచ్చి పుష్టదేహములగు నబ్బలి పుష్టములు (కాకులు) తమ దేశమున దుర్భిక్షము వాయుట యరసి యెఱిఁగి చనఁదలంచి తమలోఁ దాము ఈ కారండవములు మన కుపకారము చేసినవి. వీనిఁ గను బ్రామిపోనేరమేని వీనికిఁ బ్రత్యుపకార మెట్లు కావింప గలము' అని యనుకొన నందుఁ గొన్ని యిట్లనియె.

వీరికిఁ జెప్పకయె పోతిమేనిఁ జోరత్వ మాపాదింతురు. చెప్పి వీరనుపఁగాఁ జనితిమేని నెప్పుడో యొకప్పుడు ప్రత్యుపకారము చేయకతప్పదు. అట్లగుటఁ జేసి వీరు మనకుఁ జేసిన యుపకారం బప్పుగాఁ గొనిపోనేల? వీరిపైని దప్పొకటి యారోపింపుదము. దాన నదియెల్లఁ జెడును. వీరలమీఁద నేమిదోస మారోపింపఁ గలదు? లేకేమి ? వెదకినఁ గొఱఁతలు దొఱకవా ? యని యాలోచించుకొని కాకులన్నియు నీరుకాకుల యొద్దకుఁ జని యిట్లనియె. "ఓహో నీరుకాకులారా ! వింటిరా? మానాము ములు చిరజీవములు. మే మెవరిని జీరికిఁ గొనము. స్వచ్ఛంద వృత్తిని బ్రతుకువారము. ఒకరి పెట్టుపోఁతలకుఁ జేతు లొగ్గము. ఒకరి దయా దాక్షిణ్యములతో జోలిలేదు. అనవ సరముగా మమ్మొక్కఁడనాఁపి పరిభవించినారు. నెల పది ప్రొద్దులు మేమిచ్చట నిల్చినమాత్రన మీరు మాకు సత తము నెంగిళ్ళు వెట్టితిరి. మీ రెంత యెత్తువారిచేతి బిడ్డలైనను మీకుమాత్ర మక్కఱలు గలుగవె ? ఓడలఁ బండ్లు బండ్ల నోడలుఁ జనుదెంచుట లోకవిదితమే కదా! సుంత యోజింప వలదా? ఇంతలింతలు సేయఁదగునా. పుచ్ఛంబులెత్తి మీ క్రిందిభాగములు మాకుఁ జూపుదురా. అస్వచ్ఛులై నీటఁ

గ్రుంకు తుచ్ఛులుగారా, మీరు? మీకుఁ బిన్న పెద్ద యంతర మెక్కడిది. జాతి నీతివిడిచిన మిమ్ముల నేమందుము? మాలో సగముమంది వ్రతులు. వారెల్ల మీరు పుచ్ఛముల క్రిందుఁ జూపుటఁజేసి యొకప్పుడు నాహార మొల్లకుండిరి. మీ కొఱగాములు మీకడన యుండుఁగాక. ఇదేమేము పోవుచున్నా మని కాకా యని యఱచుచుఁ గరటంబులు తమ పూర్వ ప్రదేశమున కెగిరిచనెను. కావున నుత్తముఁడు కరుణాళుఁడై యుపకార మొనర్చినను నీచుఁడు ప్రత్యుపకారము చేయక పోవుట యటుండె నపకారముగోయును. లేదా యాపదఁ జేయును.

అని కృష్ణరూపి చెప్పిన వినియును నప్పాముతోడి చెలిమి విడువక తనమనంబునఁగల తలంపుమాననని తనపతికి వృకోదర ప్రధానుఁ డిట్లనియెను.

"తులువలకు మూఁడినయాపదలు చెలికారంబుమైఁ దొలఁగఁజేయఁ దలఁచువాడు పులికి నుపకారంబు చేయనెంచిన వడ్రంగిపిట్టవలె భంగంబుపొందును. ఆకథవినుతు వినుఁడు.

పూర్వమొక యరణ్యమునందు శార్దూల మొక్కటి వాసము చేయుచుండెను. అది యొక్కనాఁడాఁకలి పెల్లున నొకమృగమును వ్రేసి దాని నెత్తురు కుత్తుకబంటిగాఁ ద్రావి దాని మాంసము భక్షింపఁదలఁచెను. కాని దాని కోఱల సందుల నెంపములు (ఎముకలు) గ్రుచ్చుకొనెను. ఆ యెముకలఁ బైకిఁ బుచ్చు నుపాయము దానికిలేదు. పంటికుదుళ్ళు పుచ్చెను. బాధ హెచ్చెను. ఆహారముగొన నేరదయ్యెను. నోరు దెఱచెను. నాలుక వ్రేలవైచెను. చొల్లు పెల్లుగాఁ

గార్చుచు తలవ్రేలవైచి యేడ్చెను. అచ్చటనే చెట్టుపైనున్న ద్రుమకుట్ట విహంగమ మదిగాంచి "ఓయీ శార్దూలరాజా! యేల యీలీల జాలిఁగరంగి యేడ్చుచున్నావు? నోరొక మాఱును మూయ వేల? తీవలు కాలఁజుట్టినను త్రెంపలేవేల! యేమికతంబున నీకీయాపద వాటిల్లినది? మాలదైవమున కేల జాలిలేదయ్యెను. చెప్పుమనఁ బులి తనపడుబాధ నెఱింగించెను. అదివిని మ్రానిపోటుయుఁ బులుఁగు నీపడుబాధ నే నుపాయంబుతోఁ దలగింతును. నీవేమి యుపకారబు నాకుఁ జేయుదు వనఁ బులి "యిదియది యని నొడువనేల నిన్ను నా యాప్తసఖునిగ మన్నించి నేనే జంతువును జంపినను దానినంజుడు నీకు సాఁబాలు పంచియిత్తును. అంతియకాదు. నీవే హితము గోరిన నది చేయఁగలను." అని పలుకుటయు వడ్రంగిపిట్ట 'నీనోరు బాగుగా దెఱువుము' అనిపలికి యదియట్లు దెఱవఁగాఁ దెగువఁదనంబుతో న దుమూతి నైపుణ్యముతో దాని దంష్ట్రికలు పాదమునఁదన్ని సంధి నున్న యెముక నూఁదిపట్టిలాఁగి యిటు నటు కదిలిచి పెఱికి దాని వాఁగడ వెడలిపోయి చెట్టెక్కి యెముక నుమిసెను.

పులినోటిబాధ యుడిగి పుండాఱిన కొలఁది నాళ్ళకొక మహామృగమును వధించికొని యొకచోఁ గూర్చుండి దాని యెఱచి నమలుచుండఁగా ద్రుమకుట్ట మచ్చటికివచ్చి కట్టెదుట నిలిచి "వ్యాఘ్రరాజా! నాభుక్తికిఁదగు మాంసము పెట్టుము. మృదువచనముల నన్నుఁ దనుపుము. అని పలుకుటయుఁ బులి 'నీవెవ్వరు? నీకుమాంసమేల వలసెను? నేనేరికిఁ లంచమువెట్టను''నీవుపులుఁగవు. నేనుమృగపతిని. నామాట నీకేమి ప్రయోజనముగలదు? అనవినియాపక్షి "నన్నెఱుఁగవా?

నీనోరందూఱి నీపంటినందుననాటిన శల్యముఁబెఱికిన చెలికాని నన్ను మఱవఁజెల్లునా?" యనఁ బులి వెడనవ్వునవ్వి "పక్షీ! కాయలుడివోయిన చెట్టు, పాఁడి యీయని యావు నేఱుదాఁటించిన వాఁడు గార్యము నెఱవేర్చినవాఁడు, నప్పుడె కానిపిదప నాదరణీయులుగారు. అది యెట్టిదంటివేని విను.

వనాంతర భూములయందు బహుసత్వముల భ్రమించి పేరుగాంచి కృపాలేశములేక విహరించు నావదనముఁజొచ్చిన నిన్నుఁ జచ్చినవానినిగాఁ జేయక విడిచిపుచ్చితిని. ఇంతకంటె నీకుపకారము నేఁజేయంగల దెద్దిగలదు? చాలు. పొమ్ము. అని యిట్లు వ్యాఘ్రంబు ప్రలాపింప నప్పటికిఁజేయునది లేక ద్రుమ కుట్టంబు తొలంగిపోయి "పాదాహతమైన ధూళికూడ నెగసి తలయెక్కి త్రొక్కును. ఒకనిచే నలఁపఁబడి వానిఁ దొడరఁ దలఁకిన వాఁడధమాధముఁడండ్రు, అట్లగుట। నేను బులిపని పట్టక యెట్లుమునిఁగెదనని" తనలోఁ దా నిశ్చయించుకొని మన స్సునఁ గెంపుచేసికొని కినుక ఘనంబుగాఁగఁ బొంచియుండి సమయంబు నిరీక్షించి పొంతపొదలోఁ బొదలుచున్న పులి నీక్షించి తటాలునఁ జని దాని కన్నొక్కటి తన యుక్కు ముక్కుతోఁబొడిచి రివ్వుమని యెగసి చెంతనున్న చెట్టెక్కి నిక్కినిక్కి చూచి వెక్కిరించుచు నిట్లనియెను.

పులీ! వింటివా ? పోయిన నీకంటికి వగవకుము. రెంట నొక కన్ను మిగిలియుంటకు సంతసింపుము. అని పలికి యది నిజేచ్ఛను జనఁగానె పులి కంటిబాధకుఁ దాళఁజాలక నేలఁ బడి వాపోవుచు వనమెల్ల నదురు నట్లు లఱచి యఱచి తన కృతఘ్నత్వమునఁ దాన హతమయ్యెను. కావున బలముగల



...శాంతుల కగ్గలుచేసి క్రమకట్టంబును బరిభ
...లోవ శీఘ్రము చెందుదురు.

అనుటయు నక్కకంబుల నుద్దేశించి భద్రదర్శకమిట్లనియె. "ఓకప్పలారా! యొప్పులకుప్పలారా! ఈ నూతిజలంబులు నేనొక్క పుకిలింపు ద్రావినంతన తఱిగిపోవునా? ఈ పనికి మాలిన సిబ్బి! నాతోనింత పోరవలయునా? ఇంత నిష్ఠుర లోభము నీకుఁ దగునా? లోభము మితముగా నుండవలయుఁ గాని యమితంబుగా నుండరాదు. అధిక లోభంబుచేతనకదా పొల్లి మృగఘాతుఁడు నొక్కఁడు మృత్యువు చెందెను. ఆ కథ వినుము వినుఁడు.

విజయపురము చెంతనున్న కాంతారాంతరమున నొక్క బోయ వేఁటపోయి యొక వనగజమునుగాంచి పుట్టపై కెక్కి వాఁడి బాణమున దాని తొండమును ద్రుంచి సమయఁజేసెను. వానియెక్కిన పుట్టనుండి వెల్వడివచ్చి యొక్కపాము వానిం గఱచెను. వెంటనె వాఁడు తన వాఁడి కఠారంబునఁ దానిం దెగనఱకి తానును నేలంగూలెను. అంతలో నొక్క నక్క యక్కడికివచ్చి వానింగాంచి సంతసించి 'యేనుఁగాఱు నెలలు కిరాతుఁడేడు వాసరములు సర్ప మొక్కదినము తినఁ దిండికి సరిపోవునని యెంచి పీనిని, నేఁడే గంటివెట్టనేల? యీ వింటి నారితో నీపూఁట గెంటెదనుగాకయని తలంచి యెక్కువెట్టిన యా ధనువును గదిసి దానికొమ్ము తన గొంతుఁద్రోలున మోచియుండఁగా గొనయంబు నరంబు లొక్కటొక్కటి నానిచి కొఱుకఁగ గొనయమెల్లఁ ద్రెవ్వి వింటికొమ్ము మిడిసి

తన కంఠమున నాటఁగాఁ బెడతలవెట్టి కూయిడి యది గెడసెను.

అట్లగుటం జేసి లోభంబొప్పదను ద్విజిహ్వపలుకు లాక్షే పించుచు 'నసారి' యను కప్ప లోభం బొప్పని దేని నతి వ్యయ శీలత్వంబు మేలె ? యని యిట్లనియె.

దుర్బుద్ధులగువారు కలిమిగలనాఁడు కొలఁది యిడరాని పలు తెఱఁగుల వ్యయంబులు పెరిమల (ప్రేమ) కొఱకై చేసి దురైశ్వర్య మహిమముచే నారికేళ బకమను పులుఁగు (పక్షి) పొలిసినయట్లు పొలియక (నశింపక) మానరు. అది యెట్లంటి రేని వినుఁడు.

అల్పజలంబుగు మడుఁగొక్కటి గలదు. దానిచెంగట నున్నతమగు నొక్క నారికేళము గలదు. ఆ మడువులోని మత్స్యంబుల భక్షించుచు నా చెట్టుపై నొక చీకు కొక్కెర సదా వాసము చేయుచుండును. ఒక్కనాఁడది తన జాతి పక్షులు వేలకొలఁది యాకసమునఁ బోవుటకాంచి వాని కడ్డంబుగాఁజని 'యో నాకొలము సాములారా! మీరలూరక పొఱుట తగవుగాదు. అల్లదే నావసియించు నారికేళము. మీరచటికి రావలయును. మన బంధుత్వము పాటింపవల యును. నా యాతిథ్యము స్వీకరింపవలయును. ఆ ప్రాని నానికొనియె కొలను గలదు. అందలి నీరంబు లమృత తుల్యములు. జలచరముల రుచులు చెప్ప గిప్పరాదు. 'భర ద్వాజు విందు' గావింతును. రండు. అనుమానింపకుఁడు.

అనుపలుకులు విని బుద్ధిమంతంబులగు కొన్ని విహంగంబులు 'ఓయీ! వలవదు. మమ్మునాఁగకు. నీవు గుణవంతుఁడవు.

నీ బంధుప్రీతికి మెచ్చువచ్చె. నీయింటికివచ్చిన నొకండు రాకున్న మఱియొందునా? మమ్ము పోనిమ్ము. మఱొకప్పుడు వత్తుముగాని యని యెన్నివిధములఁ బలికినను నది కదలి పోకుండుటఁగాంచి వానిలోఁ గొన్ని దానితో నిట్లనియె. ఓయీ యమాయికుఁడా! యిదియేమివెఱ్ఱి! చూచితివా? యీపక్షి సంఘమును? ఒకటా రెండా? పదివేలున్నవి. నీ యిల్లా చాలఁజిన్నది. నీచెప్పిన నీళ్లు, నాహారము మా యెఱుంగనిదికాదు. అవి యల్పమాత్రములు. నీవు వీరిని భరింపఁజాలవు. మఱొక్కయెడకు మమ్ము సాగిపోనిమ్ము. ఈ మడుఁగు నిన్నొక్కనినిమాత్రమ జలదాగమమునయుతంకుఁ బోషింప సమర్థంబై యుండు.

అనుటయు నది వినిపించుకొనక 'యయ్యలారా' మీదయ వల్ల నన్నియుఁ గల్గెడు· నెందును గొఱంతలేదు. నాప్రార్థన మంగీకరింపరేని మీయెదుటనే నేను ప్రాణంబులు దొఱంగు వాఁడను.

అనుటయు నవియెల్ల నుల్లంబులు జల్లుమన 'నీచిన్నపనికినై మనమాఱడియుఁ బాపమును బొందనేల? పోదఁడు. వెళ్ళి వత్తమని కొక్కెరయింటి విందువై పోయి మడువెల్లఁగాలించి మందునకైన మత్స్యంబులేకుండ మ్రింగి యా మా పంద నిలిచి యిఁకనక్కడఁ దమ కాపోవదని తలంచి వేగుఁబోకనలేచి వేఱొక్కయెడకుఁ జనెను. కొక్కెర యొక్కచేఁప యైనను దనకక్కడ లభింపక పోవుటచేఁ జిక్కి బక్కదేహంబుతోఁ గొన్నిప్రొద్దులకు నన్నమో రామచంద్రా! యని యంగలార్చి చచ్చెను.

అట్లగుటంజేసి నేల ప్రొద్దు (దేశకాలములు) జతనము పూర్వార్జితవిత్తము విచారింపక వ్యయము చేయునతఁడు దీనతఁ జెందును. పెద్దనోటితో నీటిని గైకొని సన్నముగా వెలార్చు. కమండలువును జూచి యాయవ్యయముల క్రమ మెఱింగికొనవలయును. అనుటయు విని భయదర్శకమిట్లనెను. ఉచితలోభంబు కర్తవ్యంబు. అతిలోభ మొప్పదు. అతి లుబ్ధతచే ధనగుప్తుండను వణిజుండు తన యపారధనంబు భూపతిపాలు చేసికొనెను. ఆకథ వినుతును వినుండు.

మోక్షదాయకంబులగు పట్టణంబు లేడింటిలో నుజ్జయిని యొక్కటి. అందు ధనగుప్తుఁడు వర్ధమానుండు నను నిరువురు వైశ్యులధికైశ్వర్యవంతులై పెంపుగాంచుచుండిరి.

వారిరువురు 'జీనపుదీవి'లో నినుము బంగారము తుల్య మగు వెల కమ్ముడుపోవుచున్నదని విని యచ్చట మానియ మాడ నెంచి యోడలనిండ నినుము నింపి యపార పారా వారంబునఁ బయనంబు సాగించిరి. కొండొక దూర మేగు నప్పటికి వర్ధమానుఁడు మహాజ్వరమున కెగ్గమయ్యెను. అది కని ధనగుప్తుఁడు 'అన్నా! వర్ధమానా! యీ వేఁకితో నీవు సముద్రయానము సలుపవలదు. ఇంటికిఁ బొమ్ము. నేనొక్క రుండ నేఁగుదును. నీపక్షమున వర్తకము నెఱపుదును. నీలా భము నీకుఁ బూవులలోఁ బెట్టియిత్తును. వెడలుము. నీవుకల్గిన సమస్త శుభములు గలుగును.' అని పలికి వానిని మగిడించి తానచనెను. ఆదీవిలో నినుమొక యెత్తునకు రెండెత్తులు పుత్తడి లభింపఁగాఁ జిత్తంబానందామత్తమై యాతఁడు దానిఁగొని తనమనికి పట్టునకుఁ (ఇంటికి) జనుదెంచువాఁడై యా సముద్ర

మధ్యంబున నిట్లు తలంచెను. "వర్ధమానుని యోడెఁ డినుమునకు రెండోడలబంగారము లభించెను. ఇందు వానికిఁ గాసువీసమైన నీఁజాలను. వెనుక నాతఁడు శ్రమపడి యార్జించిన యార్జితధనంబులో నాకు సాఁబాలేని యిచ్చినాఁడా? ఎక్కడి చెలికారము? ఎక్కడి చుట్టరికము? నే నీ నడుసముద్రములో మునిఁగిన వాని నెయ్యము నన్నుద్ధరింపఁజాలునా? చాలుఁ జాలు? ఏటిమాటలు? అని తలంచుచుఁ గడలిఁబడి వెడలి వచ్చుచు వర్ధమానునివైపువారి నందఱినిఁ జెచ్చెర నీటిలోఁ బడఁద్రోచి చంపి యొక రేవుచేరి యచ్చటనున్న యొక పట్టణంబున నాచతుష్కమగు బంగారము (నాలుగుగోడలబంగారము) భద్రంబుగాఁ బాఁతిపెట్టి నిష్పచ్చరమ్మునఁ దొప్పఁ దోఁగుచున్న వానివలె నిజనివాసంబునకుఁజని దొంగను దేలు గుట్టినట్లు మిన్నకుండెను.

అప్పుడువర్ధమానుఁ డచ్చటికివచ్చి వానిఁగాంచి యన్యోన్య సమాగమోచితములైన పలుకులు పలికి చెలికాఁడా! నేను బీడసెందితిని. సేగులు పెక్కులయ్యెను. సొమ్మఖిలమ్ము వమ్మైనది. నీవెప్పు డరుదెంతువాయని కనులు గాయలు గాంచినవి. నేఁటికి నీరాక చంద్రురాక నీరాకరంబునకుఁ బలె నాకు మోదం బొదవించెను. నీ వెట్లు లాభంబు నందితివి. ఎట్లు వచ్చితివి? అని ప్రశ్నింప మిత్రద్రోహియగు ధనగుప్తుఁడు లేని దుఃఖమ్ము నటించుచు నిట్లనియె.

'అన్నా! యేమని చెప్పుదును? దైవోపహతుఁడనైతిని. సముద్రము చల్లఁగా దాఁటితిని. అమ్మోదుపురము చేరితిని. అందొక్క యిల్లద్దెకుఁ గొంటిని. అందుఁ జేరితిని. బండమెల్ల

గదులనిండ వైచితిని. మూఁడురాత్రులు గడచెను. నమ్మ, నమ్మకుపో! ఆలోహమంతయు నెలుకలు తమపొట్టఁ బెట్టు కొన్నవి. తలఁచుకొన్నఁ గడుపు చెఱువగును. కొండంత యినుము. ముండయెలుకలు పాతికయైన మిగులనీయక తినివేసెను. ఇఁక నేమిచెప్పుదునో యప్పా! యప్పుడే నెత్తి గుడ్డ వైచికొని యోడ నెక్కితిని. మనవాడ చేరితిని. నీబలఁగ మంతయుఁ దెవుళ్లచేఁజచ్చెను. అబ్బ! యేమిచెప్పుదును నచ్చటిరోగములు! చావుతప్పి కన్నులొట్టయి తలప్రాణము తోఁకకురాఁగా నెట్లో నేనుమాత్రము కొనయూపిరితో నిచ్చటికి రాఁగల్గితిని. సొమ్ముపోయె దిమ్మపట్టె ననట్లయినది నాబ్రతుకు. నీయమ్మకడుపు చల్లఁగా నీవుముందే యీపాట్లు లేకుండ నిల్లుచేరితివి. నాపాట్లేరికిఁ గలుగకుండుఁగాక. పోయి రమ్ము సోదరా! ఏమిచేయుదుము. బ్రతికి యుండిన సుఖములు పడయఁగలము. అనిపలికి పీడుకొలిపిన విని వర్ధమానుఁడు వానిపలుకులు నిజంబులుగావని యెఱింగియు నేమియుం బలు కక నిజ నివాసంబున కరిగి యిట్లని తలంచెను. ఆత్మకార్య మొరులపైఁ బెట్టి నమ్మియుండరాదు. ఒకవేళ నమ్మి కార్యము పైఁబెట్టినపుడు వారడియాలము చేరేనిఁ దొందర పడరాదు. వేగఁబడుట వెఱ్ఱితనము. సొమ్ములయెడ నెవ్వరిని నమ్మరాదు. నమ్మకుండనురాదు. అర్థ్మల నమ్మవలయును. నమ్మినవారు గొంతగోసిరేని నేమనఁగలము? తనదేహమే నిత్యముకాదు. ఇఁకఁ దన ధనముమాట చెప్పనేల? తాను దనధనములుఁ గూడ దైవధనంబులు. దైవము పఱచినట్లు ధనములుపడును. చెలికారముతోఁ దన్నుజెఱచిన తులువనుఁగని తలఁగిపోక

యధిక ప్రియములు పలుకుఁ దీపులుఁజూపుచు చెలికాఁడై వర్తించి మఱివానిని జెఱుపవలయును.''

అని నిశ్చయించి యాతనితో నరమర (సందేహము) లేని నెయ్యంబొనరించినట్లు నటియించి యొక్కనాఁడాతని పుత్రుని లాలించుచు నెత్తుకొని ముద్దాడుచుఁ దనయింటికిఁ దీసికొని పోయి యెవ్వరికిఁ దెలియని చోటున నశ్బాలునిడాఁచి, బిక్క మొగంబువైచి యేడ్చుచునుండెను. కొండొక సేపునకు ధన గుప్తుని యాప్తులువచ్చి 'మాపాపనిఁ దెండని యడిగిరి. అది విని వర్థమానుఁడు అయ్యో! యయ్యలారా! యేమిచెప్పు దును. మీబిడ్డను జేతులలోఁ బెట్టికొని ముద్దాడు చుండఁగాఁ శాఁడుగ్రద్దయొక్కటి వచ్చి తటాలునఁదన్ని యెత్తుకొని పోయెను. అయ్యో యేమిచేయుదును. ఈవార్త ధనగుప్తున కెట్లువినుతును. అక్కడికి రావలెనన్నఁ గాళ్ళాడకున్నవి. అన నా పలుకులు విని చని వారు సెట్టికి యథాతథఁబుగాఁ జెప్ప వాఁడు పులిని గొట్టినమాడ్కి బిట్టలిగి అరే యెన్నఁడేని నిట్టివింతలు విన్నారా? కన్నారా? లెండు. పోదము రాజునకీ కథ యెఱింగింతము. అని చని తేని కీవిధ మెఱిఁగించెను. వెంటనే రాజు వర్థమానుని రావించి 'యోయీ! ఏమిటీవింత చాల పెద్దమానిసివి. ఇట్లుబొంకితివేల? గ్రద్దయేడ? బాలుని నెత్తుకొని పోవుట యేడ? యెవ్వరేని విన్న నవ్వరా? యే యుగంబుననైన నెచ్చటనైన నిట్టి వింతలు పుట్టినవే? యన వర్థమానుఁడు ముకుళిత కరకమలుండై యనయంబు విన యంబు గనపఱచుచు నిట్లనియె.

'స్వామీ! యేలినవారు చెప్పినది సత్యమె? ప్రభువు లిది చక్కఁగా గ్రహించినారు. ఇట్లే సర్వము నెఱుంగవలయును.

వినుండు బాబూ ! రెండునావల యినుము నాది యెలుకలు తినివేసెనని యీ చెనఁటిసెట్టి చెప్పుచున్నాఁడు. ఇట్టిది ప్రభువు లెన్నఁడేని విన్నారా ? బాబూ?' అనుటయు విని జన పతి 'యిదియేమి ధనగుప్తా!' యన వాఁడు "ప్రభూ! మే మిరువురము స్నేహితులము. కావుట నే నీతని యినుము రెం డోడలనిండ వైచికొని జీనపుదీవికి నేఁగితిని. అందాక యింట నాయినుమంతయు దాఁచఁగా నెలుకలు దానిని భక్షించెను. వీని యదృష్ట మిట్లుండఁగా నే నేమి చేయుదును. చెప్పుఁడు. తన రెండోడల యినుమునకు రెండోడల బంగారము నన్ని మ్మని కారించుచున్నాఁడు".

అనిన వర్ధమానుఁడు 'వినుఁడు మహారాజా! రెండోడల యినుము మూషికతండము భక్షించెనఁట! అది సత్యమఁట! బాలుని గ్రద్ద యెత్తుకొనిపోవుట యసత్యమఁట! ఎంతచక్కని పలుకులో వినుఁడు మహాప్రభూ!' అనుటయు రాజు విని వికావిక నవ్వి మంత్రులఁ గాంచి "బలేపని చేసినాఁడవు వర్ధ మానా! ధనగుప్తుని యెత్తున కెత్తువేసి త్రోసిరాజు చేసినావు. ఏమోయీ! ధనగుప్తా! పెద్దవాఁడవు. నలుగురిలోఁ దల త్రిప్పుకొనుచున్నావు ? ఇట్టి మాటలాడఁ జెల్లునా ? లోకము విన్న నవ్వదా ? వానిధనము వానికిమ్ము. పొమ్ము. క్రుమ్ము లాడకుము." అనుటయు ధనగుప్తుఁడు 'ప్రభూ! వీఁ డిచ్చిన యినుమున కినుమే యిత్తునుగాని కనక మెక్కడనుండి తెచ్చి యిత్తును?' అనుటయు రాజు గనలి కనులెఱ్ఱఁజేసి భటులను గాంచి, 'ఓరీ! యీ కోమటి ముక్కున నీ రెత్తుఁడు. మా మెత్తఁదనము చూచి నోరికి వచ్చినట్లు ప్రేలుచున్నాఁడు'

అనిన భటులు వానిని ద్రోచికొని చనఁగా వాఁడు భయపడి "అయ్యా! బొంకితిని. బుద్ధి గడ్డితిన్నది. క్షమింపుఁడు. నా యొద్ద నొక్క యోడెఁడు సువర్ణము మాత్రమే యున్నది. అంతకన్న లేదు. మీ పాదాల సాక్షి. రక్షింపుఁడు" అన రా జది నమ్మక 'యోరీ! యింకను జూచెదరేల? వీనిని గొని పొం' డన వారు వాని నీడ్చి తన్నిరి. ఆ బాధ పడలేక ధనగుప్తుఁడు తాను దాచిన నాలు గోడల పసిఁడిగల చోటును, వర్ధమానుని భటప్రకరంబును జంపి వారాశిఁ ద్రోచిన విధమును బూసగ్రుచ్చిన తెఱంగునఁ జెప్పఁగా విని రాజు నవ్వి యా స్వర్ణంబు సర్వంబు తూర్ణంబుగాఁ దేఁబనిచి వర్ధమానుని కొప్పించిన వాఁడు సంతసించి యందు సంగోరుమాత్రము గ్రహించి, మిగిలిన యర్ధభాగమగు నర్ధము రాజునకర్పించిన రాజు వానిఁ జాల మెచ్చుకొని, ధనగుప్తుని యిల్లు వాకిలి నాశనము చేయించి, పురంబును దేశంబును వెలువడఁ ద్రోపించెను. అంత ధనగుప్తుఁడు సర్వస్వమ్మును గోలుపోయి యాలుబిడ్డలతో నందందుఁ దిరియుచుండెను.

కలిమోఁడి (ఓడ) నుమునకు రెండుకలముల పైఁడి తనకు లభించినపుడుగూడ ధనగుప్తుఁడు 'తెలివితక్కువ'చే వలను గలిగి మెలఁగఁజాలఁ డయ్యెను.

లోభంబున ధనగుప్తుని ప్రాభవమెట్లడఁగెనో చూచితిరి గదా! నాడు పలుకులు వినుఁడు. లోభం బుడుగుఁడు. నీళ్లు లకై యిట్టి లోభంబు చేయనగునా? యని పల్కి యవ్వార్తా భూవల్లభు (కప్పలరాజు) మున్నవోలె బహువిధంబుల స్తుతియించి భయదర్శకంబు మఱియు నిట్లనియె.

చిలుతనాఁటఁగోలె జీవహింసయొనర్చుటయె దానివ్రతము గాఁగ వేఱ తడవనేల ? జీవహింసాపరులను సోఁకిన గాలి నన్ను సోఁకినచోఁ గల్మషముగఁ దలఁతును. అనుట నప్పలుకు లుద్దేశించి యభిజ్ఞుఁ డను ప్లవంగంబుఁ (కప్ప) దనపతి కిట్లని యెను. అతి నిష్ఠ, యానాచరము, నతిశౌచము, నశౌచము, నతి నింద, యతిస్తుతి యివి ధూర్తలక్షణములు. అంతియ కాదు. నైష్ఠ్యంబు దుష్టకపటము. అది యెట్లంటిరేని వినుండు.

మగధదేశంబున నొక పల్లెగలదు. అందు లక్షణజ్ఞుఁడు వయసుకాఁడు నగు బ్రాహ్మణుఁడొకఁడు గలఁడు. అతఁడు సర్వలక్షణ సంపన్నయగు నొక కన్నియను బెండ్లియాడి యామె యొరులగోష్ఠిని మరగకుండ నేలమావెం (భూమిలో పలియిల్లు) బెట్టి పెనుపఁగా నందెపెరిఁగి పెద్దదియయ్యెను. అదివిని బ్రాహ్మణుఁడు పుత్రులఁ బడయఁగాక్షించి తనయం గన చెంగటికేఁగెను. ఆమె పతికి వెలిఁగెడు దీపంబును జూపి, 'నాథా ! యనలుఁడు పురుషుఁడు. దీపంబనలుఁడు కావుటఁ బరపురుషుఁడైన యనలుని నేఁజూచినఁదప్పగును. వాఁడు గూడ నన్నుఁజూడఁ జెల్లదు. దీపముండఁగాఁ బతులఁగాంచు స్త్రీల శీలంబు నేను వెలితిగఁజూతును, అనెను. అదికని యతఁడు తనయిల్లాలిని శీలవతిగా నెమ్మది నమ్మియుండెను. కొన్ని నెలకామె గర్భవతియై ప్రసవకాలము సమీపింపఁగా నేకతమునఁ బతికిట్లనియెను.

"నాథా! నాకుదయించుబిడ్డ యాఁడుదియైన సరెమగవాఁ డైన నన్యపురుషుఁడనఁబడునుగాన వానిమొగంబేను గాన

నేరను. పరలోకంబు గాంక్షించు కాంతలు పరపురుషు నవ
లోకింపఁ జాలరు ఇతరపురుషునిపేరు విన్నప్పుడేమిచెప్పను ?
నాచెవులురెండు పుండ్లగును. నిన్నువిన నీనులు, గనఁగన్నులు
గలిగి తక్కినయెడ నవి వలవదందును'' అని భర్తసన్నిధిని
నేత్రపట్టము గట్టికొనెను. అదికని వాఁడు తనయెమ్మెగాఁడిని
నమ్మి తనయింటికిఁ దోకొనివచ్చెను. కొన్నాళ్ల కామె పుత్త్రినిఁ
గాంచి యాపుత్త్రినెన్నఁడుఁ జూడని వ్రతము మాని వానిఁ
బెంచెను. దానినైష్ఠంబుగాంచి యెల్లవారు ముక్కున వ్రేలు
పెట్టుకొని నవ్వసాగిరి.

అంత నొకనాఁడు చెంతపల్లెయందున్న బ్రాహ్మణుని పిన
తండ్రి మనుమనిఁజూచి వర్తమను నాసక్తితో నిచ్చుటికి
వచ్చెను. అతఁడు పరేంగితజ్ఞుఁడు. కావున నాతనియింటివర్త
నమెల్ల నారసి దానిమాయలాఁడి తనంబు నెఱింగి ''యయ్యో!
యీతొయ్యలి తనమాయలు గప్పిపుచ్చి పచ్చి దొంగ
యయ్యు ముద్దరాలితనంబున నటించుచున్నది. కాని నంగ
నాచితనంబు గాననిచ్చుట లేదు. మావాఁడు వట్టి బోదఁడు.
దీనిమాయ లెఱుఁగఁడు. ఱతియ కాదు. తన (మగని) వారు
లేని పుట్టినింట నిన్నాళ్లుతానె చనవరితనముగలదియై మెలఁ
గిన యీమెం తాఁబెట్టిన నేలమాలెం బెరిఁగినదని నమ్మియు
న్నాఁడుకాఁబోలు. యాత్రోత్సవముల కరుగకయుఁ బొరుగిం
డ్లకుఁ బోకయు, సంగీతములు వినకయు, లాస్యంబులు గాంచ
కయు, నుద్యానములఁ దిరుగకయుఁ, జిత్రంబుల గీయకయు,
ముగ్గులు వెట్టకయు, జిలుకలను గోరువంకలను గ్రోఁతులను
బెంచకయు బొడ్డనబావుల నీఁదకయు నీమె నేల లోపలి యిం
టిలోనె పెరిఁగి పెద్దదియైనదని తలంచుచున్నాఁడు కాబోఁలు.

ఎంత వెఱ్ఱితనము! ఎంత వెఱ్ఱితనము!! సుంతయైన వీనికి వివేకము లేదు. మతిహీనుఁడు లోకవృత్తము నెఱుంగఁ జాలఁడు. పరమ ఛాందసుఁడు. సుకవాసి, పనిపంద, చూపుగుఱ్ఱము, మేదకుఁడ్డు, చల్లచప్పుడు, గోడచేర్పు. ఇల్లు పొలము తక్కనన్య మెఱుఁగఁడు. ఎంత మోసము! ఎంత మోసము!!"

అని తలపోసి, యొక్కనాఁటి రేపు (ప్రొద్దుట) పుత్త్రిఁ డూరిచెంతనున్న పొలమున కేఁగి యుంట యెఱిఁగి తానుగూడ నచటికేగి కొన్ని సముచితభాషణంబులఁ బొద్దు పుచ్చి యిట్లనియె.

"ఓయీ! యబ్బాయీ! యెంత యమాయికుఁడవురా! మీ యాబిడ కపటాచారఁబులు బయలుపుచ్చరాదు. మేమున్న రాత్రులయందయా మె వ్యాపారము ససాకల్యముగఁ దెలిసితిమి. స్త్రీలను బొత్తిగ నమ్మకున్నను, నమ్మినను జెడక తప్పదు. నమ్మకము లేక చిన్ననాఁట భూగృహమున నుంచ నేల? ఇప్పు డింతగా నమ్మి నెత్తెక్కించుకొన నేల? చేయని కార్యము పుట్టదు. పుట్టిన దానిని గప్పిపుచ్చరాదు. మసిపూసి మారేడుఁగాయ చేసిన నెన్నాళ్ళు దాఁగును? సంపన్నుఁడు, సంతత యజనుఁడు కామరూపుఁడు బృహస్పతి సఖుఁడునైన దివస్పతి (ఇంద్రుఁడు) యంతటివాఁడు చేసిన చేఁతకూడ బయలుపడునే కాని దాఁగదు. పుత్త్రికళత్ర స్నేహములఁ దలంపక దానిని నీ కినుకకుఁ బాత్రముచేయుము. అది నీ యిల్లు గుల్లచేయు చున్నది. పండించి తెచ్చిపోయుటే కాని యన్య మెఱుఁగవు. దాని వలన మన గోత్రము కళంకితముగా రాదు," అని పలికి పోయివత్తునని చెప్పి కన్నుల నీరు గ్రక్కుకొనుచు నాతఁడు వెడలి చనఁగా

బ్రాహ్మణుఁడు కొండొక వడియేమియుఁ దోఁపక నిలిచి లజ్జా భరంబున నింటికేఁగి భార్యనుగాంచి 'యోసీ! నాకు దూర గ్రామంబునఁ బనియొక్కటికలిగినది. పోయివత్తును. భయము లేదు. భద్రముగా నుండుమని కపట పేశల మృదుభాషణం బులఁ దేల్చి, యిలువీడి చనియొక్క యోలంబునఁ (చెట్లు మున్నగువానిచేమఱుఁగగుచోటు)బగ లెల్లనిల్చి రాత్రికాఁగా నె యింటికివచ్చి యిల్లాలి కెఱుక పడకుండ నట్టుగ (అటుకు) మీఁదఁ గూర్చుండి యామెపై దృష్టినిల్పి యుండెను.

అప్పటికిఁ జాలప్రొద్దు పోయెను. మడికేలు (చాకలి) గంజి మడుఁగులపేర నా యిల్లు చొచ్చెను. అది కని యా చపలాక్షి యాస్థతో నెదురేగి లోనికిఁ గొనివచ్చి యందుండుమని త్వరం తటఁ దానచని ముంగిటి తలుపు గట్టిగవైచి వచ్చి మగఁ డెచ్చటనేని నుండెనేమోయని నలువలంకులుఁ దిలకించి కలంక దక్కి 'యోయీ! మా యాయన యూర లేఁడు ఇంతలో రాఁడు. నీకై వేఁడివేఁడి యట్టులువండిన దానను. తిందువు గాని రా రమ్ము' అని భోజ్యంబులు వానికిఁ దిన్నన్ని పెట్టి పంచె పఱువుమని గంపెఁడు బియ్యముతెచ్చి యందుఁబోసి యమ్ముకొని రమ్మనెను. అదికాంచి బ్రాహ్మణుఁడు లజ్జా క్రోధదుఃఖగత మానసుఁడై యట్టువదిగి యంగణంబు వెడలి యారెకులఁ (తలారుల) గొనివచ్చి వారి నిద్దఱం బట్టించి రాజునకొప్పించెను. అదివిని యా యూరి ప్రజలెల్ల నత్యా చారంబులఁ బరఁగు నా మాయలాఁడి చరితము వింత వింతగఁ జెప్పికొనుట లాలించి రాజు వారి నిరువురను దండించెను. బ్రాహ్మణుఁడు తనయాలి చెద్దు సొలయుట (వైముఖ్యము నొందుట) చే భార్యాంతరమును గొన

నోల్లక విరతుఁడై జాహ్నవీ తటంబున కరిగి నిష్ఠమై తపం బుండెను. అట్లగుటంజేసి యత్యాచారపు మాటలు నత్యంత స్తుతులుఁ గలుగుట వినవో, కనవో ప్రత్యక్ష క్రూరమైన పాము మాటలేల సాంగత్యమునకై నమ్మెదు? నీ వీనులు మావాక్యంబులు విన నోల్లవు. అర్హుల నీతి వచనంబు లాలిం పనివారిని దైవముగూడఁ గాపాడఁడు. ఇది తథ్యము. అని పలికి యభిజ్ఞుఁడు మౌనవ్రతుఁడై యూరకుండెను. తక్కటి వారు నట్ల నిలిచిరి.

వెండియు నప్పుడు సర్పంబు తన్నుఁబొగడిన మేనువొంగి కప్పలఱేఁడు దర్వీకరంబునకు నచ్చోటు సొరఁదెరు వెఱింగింప నదియు నందు జొచ్చి మెచ్చి విచ్చలవిడిఁ దిరుగుచు నీరంబులఁ గ్రోలుచుఁ జిఱుకప్పలను జప్పరించి మ్రింగుచుఁ జియ్యఁ బట్టి లావొంది భయంక రాకారముదాల్చి పేర్చియార్చి దర్దురముల (కప్పల) భక్షింపఁ దొడఁగెను. నానాఁటికి మండూక మండలము లయమొంది దశాంశ శేషమయ్యెను. అదికాంచి మంత్రులు ప్రియులు జుట్టునుజేరి భేకాధినాథుని నిందింప నతఁడు పశ్చాత్తాప సంతప్తుఁడై భుజంగమునుగాంచి యండజ కులమండనా! మిత్రుఁడువలె నుండి మామండూక కులంబు నెల్ల మడియింతివి. మనలోమన మొండొరులకుఁ గీడుచేయు టుచితమే? తగవు పాటింప వలదే? యనుటయు బూమెల మారి పాము గోమున నిట్లనియె. 'ఓయీ మండూకరాజా! నీవు వెఱ్ఱివాఁడవు. తెల్లనివెల్లఁ బాలు, నల్లనివెల్ల నీళ్ళనని తలంతువు. నీ మంత్రులు పాపకర్ములు. చూపోపని వారు. మన మిరువురము కలిసియుంటకు సహింప కున్నారు.

కల్ల బొల్లులు పలికి మనకిద్దఱకు భేదంబు పుట్టింప సమకట్టి యున్నారు. కాన వారి నిదే నీయొట్టయెదుటనే మట్టుపెట్టుదు చూడుమని నొక్కఁడు ద్రిక్కకయుండ (మిగలకుండ) నన్నింటినిఁ బొట్టఁ బెట్టుకొనెను. తనకనులముందర నే తనవారెల్లరు వోవుటయుఁ దానొంటరి యగుటయుఁ గని భీతస్వాంతుఁడై మండూకాధిపుఁడు మొగంబు వ్రేలవైచి యుండ వానింజేరి పామిట్లనెను. 'ఓయీ? నేను నూతిదరినుండి దాహంబొంది కూపెట్టఁగా నీవు నన్ను రప్పింపవు. సరేకదా! రాజ్యమదాంధుండవై ఔప్పయెత్తినైనఁ జూడవు. ఆహా! యేమిత్రొవ్వ ? ఏమిత్రుళ్ళు? ఈ నీటిపట్టె యనంతప్రపంచమా ? కప్పవ్రుప్పులే ప్రజలా? వారికి నీవు రాజవా? యిట్టివింత లెందేని గలవే? విన్నవారుఁ గన్నవారు నవ్వరే? నీప్రేమములు గీమములు నాకిప్పుడు జూపఁ దలంతువే ? చాలుఁ జాలు ననుచు నాటోపముతో నాభేకమును వాపోవఁ గఱచి చంపి తినెను. కావున బలియుఁడగు పగతునకెడ గలిగి చనవలయును. అట్టివాఁడు పనిగలిగి కలయవచ్చినను బేలువడి బుద్ధిమంతులు కలిపికొన వలవదు.' అని యిట్లు సుమతి యెఱిఁగించినకథ. విని నితాంత మోదంబునొంది యిరువురను గొనియాడిరి. అప్పు డాసఖినిఁ గనుఁగొని నెయ్యముమై సుకుమారి కిట్లని యెను. చెలీ! ఏకాధివాస మైత్రిని జేకొను మేఖలకు నీవెన్నఁడు హితము చెప్పఁబోకుము. అది హితోక్తులు కైకొనదు. మతిమాలినది. వివేకహీనులకు హితముపదేశించుటయు వారితో నెయ్యం బొనరించుటయు నీతిపరులకుఁదగదు. అట్లొనర్చినచో కపిసహవాసముచే విహంగమునకుఁబోలెఁ గాఱియ చేకూఱును. ఆకథ యెట్లంటిరేని వినుఁడు.

క్కానన మొక్కఁడు కలదు. దానను బహుఫల సూనక మగు ద్రుమమొక్కటి కలదు. దానిపైని సూచీముఖమను వానరమును సమానస్నేహమున నివసించుచుండెను. అట్లుండ నొక్కనాఁటిరాత్రి మిన్నెల్ల మేఘచ్ఛన్నంబై కుంభద్రోణం బుగ వానకురిసెను. పిమ్మట నీదయు సన్నపుఁ జినుకులును విపినచరంబులకు బాధలు గలుగు నట్లెడతెగక యుండెను. ఆసమయంబున నవ్వానరంబు చెలియగు నగ్గిజిగాఁ డొక్క నాఁడు మంటిచాలున నున్న మిడుఁగుఱుఁ బురుగు వెన్నను గాంచి తెచ్చి తన గూటియఱలో నిడికొని దాని వెలుఁగునఁ జెలియుఁ దానును గులుకుచుఁ దడి యెఱుఁగకయుండి ప్రభూ తపు సీతునఁ గొడుఁగురవోయి యున్న వానర సఖునిఁగాంచి చింతించి నీడద్వారంబునకుఁ జనుదెంచి "మిత్రమా! వాన రేశ్వరా? వానకు నుడుకువలేదయ్యెను. నీవో వడఁకుచున్నావు. రేయొక యుగముగా నున్నది. వేఁగునో వేగదో? నీబాధ యెట్లుడుగును? నిన్నుఁ గాంచుచు నే నెట్లూరక నిలుతును? అన్నా! నాగృహము కడుసన్నము. నిన్నురమ్మన నెడలేదు. పైకాఁడనేల? ఇట్టిరట్టడి పుట్టువుచే నా పౌరుష మణఁగెను. తన యిల్లు సొచ్చిన నెచ్చెలులనెల్ల నభీష్ట వస్తువులచే సంతృప్తి పఱుపఁజాలని సజ్జనుఁడు నిట్టూర్పులు నిగుడించి విన్నఁదనంబును బొంది నెవ్వగ నొవ్వి చింతలఁ వంతలఁ జీకును మఱియుఁ దనవారికైన యొప్పము లెఱుఁగకుండను వినకుండను, గనకుండను నోర్వఁడు.

సఖా! నీవు గ్రుడ్డివాఁడవు గావు. కుంటివాఁడవు గావు. అన్నింట సమర్థుఁడవు. అయినను శీతాతపవాత వర్షంబుల

నుండి కాపాడు నాలయంబొక్కటి తొలుత గట్టుకొన్నవైతివి. దానం జేసి నేఁడీ నడికిరేయి నిట్టిపాట్లు పడవలసినవాఁడవైతివి. అని హితము చెప్పిన పక్షినిఁ గాంచి యా వెంగలి క్రోఁతి "ఔరా! వీఁడు తానును నాలియు నింటనుండి కులుకుచు నన్నొక పినుఁగుఁగాఁ దలంచి ప్రేలుచున్నాఁడు. తనయింటఁ దివయ లేదా? దాన నెగడియిడి నన్నొడలు గాచికొనుమన రాదా? కొఱమాలిన మాటలతోఁ బ్రొద్దు పుచ్చఁదగునా? ఎంతటి కుటిలుఁడు. తానఁట! దొరయఁట! తనకఁట యిల్లు గలదఁట. నాకఁట యిల్లులేదఁట. అబ్బా! యెంత క్రొవ్విన దీ పులుఁగు. ఇదే దీని మద మణంచెదను." అని తీంద్రించి యా పక్షియున్న తరుశాఖ పెళ్ళున విఱిచి యాపొంతనున్న పల్వ లోదకంబులఁ బాఱవైచెను. అంత ఖగాంగనఁ (ఆఁడుపక్షి) భయపడి కూయఁ దొడంగెను. నీళ్ళం దడిసిన యెఱకలు బెగడిన మనస్సునైయున్న ప్రాణేశ్వరినిఁ గాంచి పక్షి దాని నయ్యెడనుండి యుడిపితెచ్చి వేఱొకతావున కేగి యిమ్ముల నుండెను. కావున వివేకహీనుల త్రోవను బోవరాదు. బుద్ధి మంతులకుఁగూడ వారితోడి చెలిమి యాపద లాపాదింపక పోదు. అంతియకాదు సఖీ! తప్పులు పరిగొల్పుట, మర్మాం తర పరిహాసము చేయుచుండుట, వేరముమై నేమేనిఁ జేయు వేచుట యను నివి దుష్టసఖుల గుణములు. అని సుకుమారి యెఱింగించిన కథ విని యిరువురుం గొనియాడిరి. అప్పుడు మకరందిక యి ట్లనియెను.

కుజనులు కుమ్మరిపురుగులవంటివారు. వారితోడి చెలిమి యెట్టివారికిఁ దగదు. నీతిపరులైన సుజనులు తమ్ము నమ్మిన

మిత్రులకు సొమ్ము లిత్తురు. తుదకుఁ దమ్ముఁగూడ నిత్తురు. మిత్రుఁడయ్యు బుద్ధిమాలిన యొక క్రోఁతి తన్ను నమ్మిన భూపాలుని మడియించెను. శత్రుఁడయ్యు వివేకియగు దొంగ యొక్కఁడు విప్రు నొక్కని రక్షించెను. కావుననే విమతి నెయ్యమునకంటె, సుమతి పగ మేలని పెద్దలంద్రు.

అది యెట్లంటిరేని వినుండు.

మందరంబను పురంబు గలదు. అందుఁ గాంతాజనకం దర్పుఁ డగు రాజు గలఁడు. అతఁడు ఖగవృత్తి సమాఖ్యామైఁ దవరి బుద్ధిమంతులఁ జెండెడివాఁడు గాఁడు. చిన్ననాఁట నెన్నివిధముల బ్రతిమాలి, బామారి చెప్పినను నొక్కయక్షరమైన నేర్చినవాఁడు కాఁడు. గర్వోద్ధతుఁడు, దుర్వర్తనుఁడు నైన వానిచేఁతలకు వానిమంత్రులు రోసి "అయ్యో! అక్షరజ్ఞుఁడుగాని యతనికి శాస్త్ర పురాణాగమాదులెట్లలవడును? గ్రంథములు చదువక వివేకశుద్ధి యెట్లు కలుగును? వివేకశుద్ధి లేక కర్తవ్యకర్మమెట్లు తెలియును. కర్తవ్యకర్మమెఱుఁగక చేయు పనులవలనఁ బాపంబు లొదవును. పాపకర్మాచరణముచే నరకంబు ప్రాప్తించును. నరకవాసి పేదవాఁడై పుట్టును. పేదవాఁడు కడుపు కక్కుర్తిచేఁ బాతకములు చేయును. ఆ పాతకములచే మరల నరకమునఁ గూలును. అక్కటా! చదువులేమి యాపదలకెల్లఁ గుదురుగదా!" యని నగచుచుండిరి. అక్కాలమునందె యాతఁడు ఎలుకల వేఁట పేరఁ బట్టణమునకుఁబోయి ప్రజల యిండులు కూలఁ ద్రవ్వించును. డేగలకు వేయుటకై తొండల నేయ నేఁగి ద్రాక్షా మండపములు నేలమట్టము గావించును. కోడిపందెములకై

వాడవాడలఁ దిరుగుచుఁ గుండలమండలఁ జిలుకఁ గొట్టును. మందలలోని మేఁకలమీఁద వేఁటకుక్కల నుసిగొల్పి మెచ్చి యార్చును. కాలకింకరులవఁటి కింకరులతోఁగూడి తిరుగుచు నన్నమైనఁ దిన్నఁగాఁదినక వెడఁగుఁదనముతో దుడుకుచేఁతలఁ జేయుచుండును. ఉరులు, బోనులు, గూళ్ళు, గాలిపడగలు, కుక్కలు దక్క వాని కొంకు సైపదయ్యెను.

ఇట్లుండి యాతండొక క్రోఁతిపిల్లను దెచ్చి ప్రీతితోఁ బెంచి, కత్తిసాము నేర్పించి కంచుకము తొడిగి కుండనములువైచి వాఁడికత్తి చేతికిచ్చి కంచుకియై తనతో నుండఁ బనిచెను.

ఇట్లుండ నొక్కనాఁడాతఁడు ప్రమదవనంబున కేఁగి కాంత లతోఁ గ్రీడించి యలసటఁ గాంచి వారినెల్ల నందందు పసి యింపుఁడని పనిచి, క్రోఁతి యొక్కటి మాత్రము తనతో రాఁగా దట్టంపునీడను నిలిచి కమ్మతావులఁజిమ్ము గురివెంద పొదక్రింది గుజ్జుసెజ్జపైఁ బరుండఁబోవుచుఁ గ్రోఁతినిఁ గాంచి, తన్నుఁ డాయవచ్చిన జీవుల ఖడ్గధార కెరగావింపుమని చెప్పి నిద్రఁ గాంచెను. వానియాజ్ఞ నొదలనూని యదియుఁ గాచి యుండెను. ఆ సమయంబున నా తేనికంఠమున సుమనోదా మము (పూలదండ) శోభిల్లుచున్నది. దాని నెత్తావికై తుమ్మెదయొక్కటి మూఁగినది. దానినిఁగని క్రోఁతి రేకెత్తిన కోపముతోఁ గత్తితో వ్రేసెను. వ్రేటుతోఁ దేఁటియు రాజు కంఠంబును రెండేసి తునియలయ్యెను. వింటిరా, నీతిమాలిన రాజుచేష్ట లెట్టి చేటులు తెచ్చిపెట్టెనో! ఇఁక వివేకియైన చోరుఁడు శత్రువైన బ్రాహ్మణునిఁ గాచిన కథ వినుఁడు.

నందిని యను నగరమందు బంధుకుఁడను బ్రాహ్మణుఁడొకఁడు గలఁడు. వాఁడు చిన్ననాఁట నెన్నికఁగన్న సంపన్నుఁడు. కాని పుత్త్రులు పిన్నలై యున్న కాలమందె యతఁడు దైవదుర్యోగంబున దరిద్రుఁడయి చినిఁగి మాసిపోయి మానము నైనఁ గాపాడుటకుఁ జాలని చీర, చమురుమొగ మెఱుఁగని జుట్టు, పగిలిపోయిన పెదవులు, వాడిన మోము, బెరడుగట్టిన మేను, నై దుఃఖవ్యాహిని యైయున్న గేహినిని (భార్య) గాంచి తనలో "అక్కటా! బలవద్దైన్యము వక్త్రగహ్వరమును. బలుచోట్లఁ గొన్న యప్పులు, మేనిచాఱలు, బాలుర యేడ్పులు, బొబ్బరింతలు, గాఁగ దారిద్ర్యశార్దూలము పాదు కొంపలో భయంకరాకారముతోఁ గోలలుచేయుచుండఁగా దానిని వెళ్ళాడఁజేయ నేరితరము? ఐనను దీనిని బాపఁదగుయత్నము చేసెదనుగాక, చిత్రవర్ణినగరంబులో మాతమ్ముఁడు విపులుఁడున్నాఁడు. వాఁడు బుద్ధిమంతుఁడు. ఐశ్వర్యముతోఁ దులఁదూఁగుచున్నాఁడు. నా పేదఱిక మెఱింగెనేని వాఁడు చాల విచారించును. నాకువలయు ధనమొసంగును. అది కొనివచ్చి యిచ్చటఁ గర్షకవృత్తి నవలంబించెదను. ఈ లోకమంతయు నాల్గుపాళ్ళు. ఇం దొక్కపాలు భిక్షుకులు. ఒక్కపాలు సేవకులు, విద్యోపజీవికులు. బేహారులు తస్కరులు నొక్కపాలు. కర్షకు లొక్కపాలు. మొదలి మూఁడుపాళ్ళు పిదపటిపాలి ననవరతంబు నపహరించుచుండును. అపహరించియు నంతంత కవి నశించును. అపహృతం బయ్యు వ్యవసాయ మభివృద్ధి నందుచుండును. కానఁ దగిన రాజున్నచోఁ గరిసనపుజీవనమును మఱొక్క జీవనము పోలదు." అని

తలఁచి, కదలి చని కతిపయప్రయాణముల ననుజుని యూరు చేరి, దారిద్ర్యముచే నలిగిన మానసముకంటె, మార్గాయాసముచే శరీరము డస్సి తమ్మునిల్లు చేరఁజనఁగా నతఁ డల్లంతన తన యన్నను గాంచి. యవునా? కాదా? యని — సందియ మొంది నడక నానవాలువట్టి సమీపించి మ్రొక్కి కన్నీళ్లతోఁ గాళ్ళు కడుగఁగా నాతఁడు తమ్ముని సమోదముతో లేవనెత్తి దీవన డగ్గుత్తికయంద డింద గౌఁగిలించికొనెను. తదనంతరంబున విపులుఁ డన్నగారికి సకలోపచారములు సభక్తికంబుగా నాచరించి వాని విపన్నత నాలించి, దుఃఖించి, నిజపుత్రకళత్రసహితంబుగా నాతనిని నిష్టదేవతా నిర్విశేషంబున నారాధించుచుండ నొక్కమాసంబు చనెను.

అంత నొక్కనాఁటిరాత్రి బంధుకుఁడు తమ్మునితో "ఎల్లి యవశ్యంబునుం దనకుఁ బయనంబు సేయవలయునని నిర్బంధించి పలికెను. అదివిని విపులుఁ డొఁ గాదనలేక యర్ధరాత్రసమయంబున తన యంగణంబున మాధవీలతాచ్ఛన్నంబగు చూతకుంజంబు క్రిందికిఁ దనయన్నను దోకొని చని వెకువన యతని పయనంబగుటఁ దన్నిమిత్తంబులగు మాటలాడి, అన్నగారూ! మీ దారిద్ర్యంబు విచ్ఛిన్నంబుగా నెంతేనిఁ గనకం బిత్తును. కాని యేమి లాభము. దారి పొడుగునను దొంగల భయ మధికము. మీరు మోసికొని పోఁజాలరు. కావున ననేక నిష్కసహస్రమూల్యం బగు నొక్క మాణిక్యంబు మీ కిచ్చెదను. అది మీ రిచ్చటన మ్రింగి ప్రభాతకాలంబున జీర్ణ మలినాంబరములు ధరియించి యరుగుఁడు." అని చెప్పి యిరువురు శయనస్థానంబుల కరిగిరి. అత్తఱి నా

చెట్టుపైనున్న చోరుఁడొక్కఁడా యన్నదమ్ములాడికొనిన పలుకులు వ్యాపారములు దెలియనెఱిఁగి వారచ్చటనుండి వెడలుటయే తడవుగాఁ గన్నము వెట్టెను. ఒక్క కంచము చీరయుఁ దక్క వానికి మఱొక్కటి దొరకలేదు. అదికని వాఁడు ఇఁక నిచ్చట నిలువరాదు. ప్రమాదము వాటిల్లును. ఇచ్చట నేమియు దొరకకపోవుటయే మేలు. నేనిచ్చటనే యీ నిశి పుచ్చి వేగుతఱి నిప్పటి విప్రుని వెన్నంటి చని మణిఁ గైకొని ధన్యుఁడనై చరించెద నని నిశ్చయించికొని యచ్చోటు వాసి పోయి ప్రభాతం బగుటయుఁ బయనమై పోవు బ్రాహ్మణుని వెనువెంటఁ దగిలి సాధువోలె వానితో నుచితాలాపంబులు చేయుచుఁ దనపనికిఁ దగిన ననువు మనంబునఁ దలఁచి మార్గమధ్యమున వీనిఁ దెగఁ జూడరాదు. అడవిలో సమయించెదఁ గాక. అని నిశ్చయించి య య్యడవిని దరిసి యరుగుచుండ నక్కడఁ దెక్కలికాఱు (దొంగలు) వచ్చి చిచ్చుఱపిడుగులు వోలె మండిపడుచు నీయిరువురను గట్టియుఁ గొట్టియుఁ బరిభవములువెట్టఁగా భయపడి వారికి మ్రొక్కి 'పేదపన్నలము (వృద్ధు) రక్షింపుఁడన' వారలు జాలిగలిగి యొండొరులతో "వీరు చూచినఁ జక్కఁగా నున్నారు. వీరిమొడళ్ళకు వీరు దాల్చిన బట్టలు దగియుండలేదు. చూడఁగా నివి కపటవేషములు కానోపును. మనకుమాత్ర ముపాయము తెలియదా? పట్టుకొనుఁడు వీరి యుదరములు చీఱుదము." అనుచుండ నందులో ముఖ్యులగువారు 'ముం దొకనికడుపు వ్రయ్యంగ వ్రత్తము. అందులోఁ బసిఁడి లేనిచో రెండవవానిని బ్రతికి పోనిత్తము. బంగారమున్నచో మొదటివానితోపాటు రెండవ

వానినిగూడ బ్రతుకుము. ఇదియ యిప్పటికిఁ దగిన కార్య వృత్తము.' అని నిశ్చయించి తమ యిరువురిలోపల నొకని వధియింప నుద్యుక్తులగు సమయంబునఁ జోరుఁ డాత్మగతం బున 'అవురా! యేనేమి తలఁచినచ్చిన దైవ మేమి తలఁచెను. తానొకటితలఁచిన దైవమొకటి తలంచుననుట యదార్థ మయ్యెను. బ్రాహ్మణుఁడు పావనుండని భావింపక పాపాత్ముఁ డనై యకారణముగాఁ జంపఁ దలంచితిని. నావిధిఁ యిట్లుండ వేఱెట్లగును? ధనమెట్లబ్బును? పరులకుఁ గీడొనర్చక, యుప కారము చేయుచు ధార్మికుఁడైన సత్కులీనునిఁబట్టి పల్లా ర్పనెంచిన పాపాత్ములకుఁ జేటుతప్పదు. దైవము పుట్టు గ్రుడ్డి కాఁడు. ముందు బ్రాహ్మణుని కడుపువ్రచ్చి యందు రత్నం బుఁ గాంచి రేనిఁ బిమ్మట నాకడుపు కూడ వ్రత్తురు గాని యూరక విడువరు.

కావున ముందె నాకడుపు కోయుఁడని వారిం గోరుదును. కోసి నాకడుపునఁ గనకంబుగానక బ్రాహ్మణుని విడిచిపుత్తురు. కటికిగుండెతోఁ బాలుని ప్రాణముఁ గొనదలంచిన పాపము వానిప్రాణంబుఁ గాచి యీఁగెదనుగాక'' యని కృత నిశ్చ యుఁడై దొంగలఁగాంచి 'తనపొట్టవ్రచ్చుండనికోరెను. వారును వానిని వ్రచ్చిచూచి యెందును బంగారంబు పొడగానక యీ తని వ్రచ్చినను నింతేకాని పైడిజాడ గనఁజాలము. కాన వీని నేల చంపుటయని యవ్విప్రు బంధవిముక్తునిఁజేసి నిజేచ్ఛం జను మనిరి. వారు విడుచుటయె తడవుగా బ్రాహ్మణుఁడు పులినోటి నుండి విడివడినట్లుగాఁ దల తడివిచూచికొని చని సుతదారా దులఁ గూడి సుఖముండెను. వివేకమానస చోరుఁడగు

చోరుఁడు బ్రాహ్మణుఁ గాచిన పుణ్యంబున నాకంబునకేగి సౌఖ్యములఁ దేలుచుండెను. కావున నవివేక చరిత్ర మిట్టిది యగుటచే నాపదలఁ దలఁగఁ దలంచినవారు వివేక హీనుల సంగతి దవ్వులఁ జనదు. అని మకరందిక యెఱింగించిన కథను గొనియాడి యా మువ్వురు కొండొకసేపు సుఖగోష్ఠినుండి పిమ్మట సముచిత వ్యాపారంబులకుఁ జనిరి.

అంత నిక్కడరాజు దేవేరియలిగి చనుటచే గలఁకచెంది, పరితప్తమాన మానసుఁడయ్యెను. అత్తఱిఁ జారాయణుఁడు రాజునొద్దనుండి పరిహాస భావ విన్యాసముచే దినంబు గడపెను. పిమ్మటరాజు సంధ్యావందనాదికము లాచరించి శయ్యఁ జేరి యటనుండి నేర్పుగలయ నుంగుటింతుల దేవినిఁ దోడ్కొని రండని పుచ్చిన దేవి రానొల్లక కికురించెను. అదికని రాజు నెచ్చ నూర్చుచు, పేదనఁబొందుచుఁ, గన్ను మోడ్చుచు వెచ్చుచు (కాఁగుచు) సెజ్జపైఁ దనువు వెమ్మఁగ (తాపము నొందఁగ) వేఁచుచు, నీల్గుచు, లేచుచు నుండెను.

• అంత సేవకులు మంత్రిపుంగవుఁడగు భాగురాయణు నొద్ద కేగి రాణి రాజుపై నలుగుటయు పజ్జకు రాకుండుటయు, మున్నగు విశేషంబు లెఱింగించిన విని భాగురాయణుఁడు లాటేశ్వరు పుత్త్రికను సైగ సేయఁబనిచి యామెను రాజునొద్దకుఁ దోడ్కొని యేగునట్లుచేసి వలయు బుద్ధులు చెప్పిన నదియు నీ మృగాంకావళియు మున్న యెఱిఁగికొనిన నెయ్యముల తియ్యముల కలిమి నొర్తొర్తుఁ గూడికొని రహస్యక్రియాకుశలులై యుండిరి.

భానురాయఁడు తనకౌఁగిటినుండి వరిగి లోపలి కరుగు రాజమందిరోద్యానంబు చక్కటికి కంతకుమున్న సిద్ధంబుచేసిన దృష్టిమార్గంబు గలుగుట. వార లెఱింగిన వారలగుట నందుఁ బ్రవేశించి భూవల్లభు పడకటింటఁగల స్తంభ కుడ్యంబులు లోపల బయలైన యంత్రవిశేషంబులు గలవి యగుటయు, నందలి యంత్రకీలంబులు దొలఁగించు, కదియించు, నుపాయంబును, ఆగృహంబున ప్రవేశనిర్గమన స్థానంబులను, నందు సంచరించు విధంబులును, నంతకుమున్న మంత్రి ముఖ్యునిచేఁ గళావతి విన్నదియగుటచేఁ దానును నక్కన్యారత్నంబును నయ్యంత్రంబున నక్కుడ్యంబు లోపలఁ(గోడలో) జొచ్చి యొక స్తంభము నొద్దకుఁజని యది కేయూరబాహు నిద్రాగారంబగుటయు నందు నిద్రించిన వాఁడతండగుటయుఁ జెప్పి నేను నిన్ను స్తంభంబు పార్శ్వంబు వెలువరింప వెడలిపోయి యిన్నిలయంబులోపల నారాజ మన్మథుఁడు మేలుకొనునంతకు ననతిదూరంబుననుండి యతఁడు బోధంబు నొంది (మేల్కాని) నిన్నవలోకింప నీ కోర్కె సిద్ధించుకొఱకు. నీమనంబున నతనిని బుష్పబాణునిగాఁ దలంచి నిన్నురతీదేవిగా నెన్నుకొని యఱుత (మెడ) నున్న యీ తారహారంబు నమస్కృత వచనపూర్వకముగా వాని కంఠంబునఁ బెట్టి పెండ్లియాడఁ గోరెనేని నీవు రత్నసుందరికి వెఱతునని పలికి తప్పించుకొని యతి త్వరితగతి నేతెంచి యిచ్చటు సొచ్చునది. అని తెలియ నెఱింగించి యాసదనాభ్యంతరంబునుఁ బొందునట్లు వెలువరించినంతనే యామె 'రతీదేవితోఁ బోల యలుకగూరి యామె కనుమొఱఁగి వచ్చి యేకతమ నిద్ర చేయుచున్న

మన్మథునివలె నున్న కేయూరబాహుఁడు సుప్తుఁడై యుంటచూచి మున్నుతా విన్నదాని కన్న నావిన్నాణి చక్కఁదనము గన్నులఁ దనియింప నారాచకన్నెమిన్న కన్మోగిచి యున్న యన్నరేంద్రుని సౌందర్యమును అనిమేష స్థితోఁ గ్రోలి ఔరా! యీ తెప్పవిప్పి యించుక చూచిన నీకన్నులెట్లుంబొప్పారునో కదా! యీ బొమ లల్లార్చి యెత్తి నటించినచో నుదురెంత (నొసలు) చక్కఁగాఁ బ్రకాశించునోకదా! యని వానికడ్రవాలి సొగియ నప్పళించును. తివురును. అల్లాడును. అంతలో మానమూఁది తన్నుఁదాన మగుడఁ దిగుచును. ఇంతలో రాజు నిద్రవీడి యరవిరియు కన్నుదోయితో లాట రాజపుత్రికఁగాంచి రత్నసుందరి యరుదెంచెనని తలంచి తదేక దృష్టితోఁజూచి కాదని యెంచి యచ్చెరువును సందియంబును డెందంబున సందడింప దేహకాంతులు నగలకాంతులతోఁ దగవులాడుచు నెగసి పార్శ్వములఁ బచరించి చుట్టును బర్వఁగాఁ బరివేషములో వెలుఁగు చంద్రుఁడో యనునట్లున్న లాట నరపాల తనూజను విభ్రాంతితోఁ జూచెను. వాని చూపుల దాని మేని చెలువంపుఁ దీపులు గ్రోల సోఁకిన చోటన నిల్చెను. వీనులు దాని మంజులంబును కోమలంబును నగు వాగమృతంబును ద్రావుట కాసపడెను. మనస్సు దాని యొయ్యారంబునఁజిక్కి యుక్కిరి బిక్కిరాయెను. నిగుడ్చుచు మగుడ్చుచు నొండొకళ్ళపైఁ జూపుగములు పఱపి కొనిరి. ఆ సమయంబున నా కన్యారత్నము తన మెడలోని ముక్తాహారము తీసి ‘ లేచితివా? కుసుమశరా! నమస్కారమనుచు ’ వాని కంఠంబున నుంచెను. అప్పుడా తేనిచూపులా మించుఁబోఁడి భ్రమరంబులకు ముంగురులగు, ముంగురుల రంగులఁ

గ్రోలెను. వెంటనే మన్మథుఁడు విల్లెక్కిడి. రాజును గాఁడ
నేసెను. ఆ పుష్పబాణు నారాచంబుల పాటునఁజేసి రాజు
అలసెను. సొలసెను. తగవు నవులఁగ్రోసెను. లేచెను. ఆమె
దగ్గఱకేగెను. 'హరిణేక్షణా నీ వెవ్వరిదానవు? పేరెయ్యది?
నిన్నెవ్వరిచటికిఁ దెచ్చిరి? నన్ను నీబంటుగ నేలుకొనుము. కికు
రింపకుము. అని యామె హస్తము పట్టుకొనెను. ఆమె వాని
ధైర్యమును ద్రవ్వ కన్నులతో నదల్చి కరంబు విదల్చెను.
'రాజా! నీవు రత్నసుందరి కోడుదువు. మమ్మేల పట్టెదు?
వలదు? వదలుము' అని పలుకుచు నా స్తంభంబు సొచ్చి,
యంత్రముల గదియఁ దిగిచి యదృశ్యయై పోయెను.

అప్పుడురాజాయొప్పుల కుప్ప పోకకు నాశ్చర్యపడి యది
కలయో నిజమో యని వగచు చుండెను.

అంత నాకసంబునఁ జుక్కలు లెక్కింపఁ జులకనై ప్రాఁత
ముత్తియములవలె నుండఁగా, నుదయాచలమునుండి యొద
వెడు కెంజాయలు మాణిక్యవేదితో మచ్చరింపఁగా దివిజ
గంగాస్రవంతి చెంగట నమృతభానుఁడు (చంద్రుఁడు) మేని
కాంతి గోల్పోయి మదియించను బోలఁగాఁ జలిగాలి తాఁ
కుటఁజేసి తెలిసి కొండొక వడికిఁ. గవలెల్ల జక్కవకవలను
బెరయఁగా (చేరు) గృహదీపములు వెలరు వాఱుచుండఁగా
విరులమీఁది యళులు గోరంట విరులను దొరయఁగా నలు
దెసలను గలువలకలుములను నలినములు నవ్వఁగాఁ బ్రత్యూష
వేళయయ్యెను. అంత జలజ వనంబులకుఁ గూర్మి చెలికాఁ
డును, జక్కవల కక్కజంపు ముదమిడువాఁడును, నిక్షుచుక్కల
దాడికాండును, ముల్లోకంబుల మ్రొక్కుల యిక్కయుఁ

వేదములు మొలిచిన పాదును, యోగులకు మోక్ష ద్వారంబును ప్రాణికోటికి వెలుఁతగును నైన వేవెలుఁగు తూర్పునఁ దోఁచెను. అత్తఱి త్వరిత కృత ప్రాతరుచిత వర్తనుఁడై యేకతంబున్న. రాజచంద్రునిఁ ప్రియసఖుఁడైన చారాయణుఁడు భయభక్తి సమేతంబుగను జయశబ్ద పూర్వకంబుగను సమీపించి నమస్కరించెను. వానింగాంచి రాజు హాసన్ముఖుఁడై యిట్లనియెను.

సఖా! చారాయణా! యేమిచెప్ప! జను లెవ్వరు నెన్నఁడు నెచ్చటఁ గాననేరని యొక్కచోద్యంబు నీ రేయి వేగుఁ బోకటఁ గంటిని. విను.

చైతన్యమొందిని చిత్రము, చిఱునవ్వు చిందు చిగురు బొమ్మ, నడపాడనేర్చి నవకంపుఁదీగ, మురిపెముల విరుల మొత్తు; వంకలుదీర్చిన క్రొన్నెల, మాటాడనేర్చిన పసిఁడి ప్రతిమ, చలనములేని తొలకరి మెఱుపు, అలంకరించిన కామబాణము, నాఁగనొప్పారు వెలనాఁగ యొక్కతె నా నిద్రామందిరంబున కేకతమ వచ్చి యుండఁగా నేనుగంటిని. ఆమె మానవాంగనా సదృశంబుగాని రూపమహిమ గలది. అప్పా! దానియొప్పు నేమనిచెప్ప! నవప్రవాళ రుచిరమగు నధరము, మాణిక్య పాదతలము, వజ్రల సచ్ఛరణ నఖము నీల కచము, గల యా యన్నులమిన్న రత్నపుత్రికగాని మఱి యొక్కతె కాదు. ఆసుందరిమణి, తన చూపుంగోవుల నాపై నిరోచుక పొలయించినది. ఆచూపు లిందు కరములు ముంచి తెచ్చిపైని వంచినట్లును పువ్వుల వైచినమాడ్కిని, కలువదండ సారించిన లీలను, తమ్మివిరి త్రిప్పిన రీతిని, మెఱుఁగుఁ దీఁగె

గప్పించిన యొప్పునను, వాలు జళిపించిన క్రైవడిని నన్నల
యించెను. ఇంతలో నామె శయనతలంబున నాసీనుఁడనైన
నన్నుఁ గదియఁ జనుదెంచి, శిరీషకుసుమ పేశలంబును సుధా
మధురంబును నగు వాక్కుల నావీనులఁ దనుపుచుఁ దన
కంఠంబునఁ గ్రాలు ముత్యాలహారము నొయ్యారంబునఁ దీసి
తన కోమల కరపల్లవ ద్యుతులు నామేనెల్లఁ బర్వునట్లుగా
నాకంఠంబున వైచెను. అత్తఱి నేను జిత్తం బుత్తలపాటు
చెందఁ గోమలీ! నీవెవ్వతెవు? చెప్పుమని చేయి పట్టికొంటిని.
వెంటనే యామె 'యోయీ! నేను రత్నసుందరికి వెఱతును'
ననుఁ జెనయకుము. (తాఁకకు) అని నన్నుఁబల్కి కన్నుల నద
ల్చుచు, నామనస్సుతోపాటు తనహస్తమునుగూడ మెలఁకు
వతోఁ దిగిచికొని చనెను. నేను వెను వెనుకన వెడలితిని.
కాని యత్తరుణి నాచేఁ జిక్కక యదృశ్య యయ్యెను.
మిత్రమా! యెంత చిత్రము. అప్పటినుండియు నాచిత్తము
సందియంపుఁ జీఁకటిఁబడి తత్తరించుచున్నది. ఇదికలయా ?
కాదు. నిక్కమా? కాదు. కలయు నిక్కమును బొత్తున
హత్తఁగాఁ గ్రాఁగిన చందమా? నిజముగాఁ గలయగు నేని
నా కంఠమందున్న యీహారము నేమందును? సత్యమందునా?
యాకలికి వెడంద తెలివాలుఁ గన్నుల సుందరి నాముందఱ నేది?

అనియిట్లు హృదయ వికారంబున, మది మది లేని యావేదిసీ
కాంతునిఁ గనుంగొని సంతసిలుచు రత్నసుందరి సౌభాగ్య
గర్వమును హరింపనెంచిన చారాయణుండు తనలోఁ "గ్రా
నిమ్ము. రత్నసుందరి పైని నిలిచిన వీని మనంబు పాత్రు
కొంత కదిలినది. ఇది యదనుగా వీనిమదిని నొండొక ముదిత

పైఁ బొదలఁ జేసెదనుగాక" యని తలంచుచు నారాజచంద్రు నితో నిటనియెను.

మహారాజా! యింతవంతలఁ జింతలఁ జీకెదవేల? నీ సౌం దర్యంబునం జిక్కిన యది దేవకాంతయైనను ధైర్య సారంబు చెడి మగుడవచ్చి నీ యడుగులఁ బడకమానదు. ఇందుల సందియంబు డెందమునఁ బొందిరపకుము. నామాటలు గీటునఁబుచ్చక నమ్ముము. ఇదే యామగువను నీకుఁజూపె దను. అంతియెకాదు. అప్రయత్నముగ దాని సంబంధంబు నీ కనుసంధించెదను.

అని యిట్లిచ్చట ముచ్చటలు చెల్లుచుండ నావల రత్నసుం దరి మేఘలకుఁ బ్రియంబు సేయుపొంటె రాజు చారాయణ ద్వితీయుఁడై యునికి విని యా విదూషకు మీఁది యలుక నటుపోవక సపరివారయై నిజనివాసంబున నిలచెను. ఇట నద్దేవి యాగ్రహంబ యనుగ్రహంబుగా సంతసిల్లుచు రాజు తానును, సఖుఁడును మందిరారామంబునకుం జనియె. అట ముున్న వసంతాగమ సమయ మగుటయు వనములెల్ల మృదు వల్లులను, మృదువల్లులెల్ల లేఁగొనలను, లేఁగొనలెల్ల గుత్తు లను, గుత్తులెల్లఁ జిగుళ్ళను, జిగుళ్ళెల్ల గ్రొవ్విరులును, గ్రొవ్విరులెల్లఁ దేఁటులును, దేఁటులెల్ల నునుమ్రోఁతలను దుంపెసలారెను.

అత్తఱి రుద్రుని వేఁడికంటి క్రొవ్వు నుడుపఁజాలిన కంద ర్పుని మాఱట బొంది, మెలదీఁగె లనెడు నెలనాఁగలకుఁ బ్రీతిమై నర్తంబులు నూవు నటుఁడు, వనములఁ గ్రీడించు

దంపతులు గోరు సురంటి, ఆమని ప్రాణము, ఉద్యాన సౌంద ర్యము, కొలంకుల చుట్టము. అచ్చ వెన్నెల నెచ్చెలి యగు మలయమారుత మెల్లెడల మెల్లఁగా జల్లఁగా బలిసి పొల సెను. మఱియు నెయ్యెడఁ బ్రకృతియంతయు నత్యంత కమ ణీయంబై శుకపిక శారికాకల నాదంబుల మనోహరంబై యుండ రాజు సఖునిఁగాంచి యిట్లనియెను.

చారాయణా! ఇందు నేవిహరింపఁజాలను రమ్ము. పోదము. అని చెలికాని దోడ్కొని యొక లతామండపము సొచ్చి యం దలి చంద్రకాంత వేదికపై మేనుజేర్చి పొరలి లేచికూర్చుండి తన కంఠమునఁ గాంత మున్ను పెట్టి చనిన ముత్యాలపేరు తీసి కేలం గీలించి, ప్రీతితోఁ గాంచెను. రెండుచేతులతోఁ ద్రి ప్పెను. మోమున నొత్తెను. ఱొమ్మున హత్తెను. తిరిగి మెడలో ధరించెను. మరల పైకిఁ దీసెను. ముద్దులాడెను. అప్పళించెను. కప్పుకొనెను. ఇట్లు మితిమీఱినమనోరథంబులఁ దేలుచుఁ బొగులు రాజును గాంచి చారాయణుఁడు 'సఖా వనవిహారం బొక్కటియేల పోదము. ద్యూతక్రీడ యొనర్తుం గాని నిజనివాసమునకు విజయము చేయుము. అని తోడ్కొని. చని యచ్చట రసాంతరంబు పుట్ట వినోదంబులును నీతి గర్భి తంబులునగు కథా విశేషంబులు వినిపింపఁ దలంచి యిట్ల నియె.

ప్రభూ! దేవిగారు మేఖల నప్పుడు నీవిధమున మన్నింపఁగా నీ సు మచ్చరము పుట్టి నీతి విధిజ్ఞయగు కళావతి నన్నుఁబంచి దానిని భంగ పెట్టించినది. కంటివా? సుత హంతయగు కిరా తుని శుకి తనమేధాబుద్ధిచే మృతునొనర్చినట్లు మతిమంతులు

నిజ శత్రువుల నితరులఁ గొనియైన నేవిధము చేతనైనఁ జెఱ
తురు. అది యెట్లంటి రేని వినుఁడు.

ఒక యడవిలో నొక మహోన్నత వృక్షముగలదు. అం
దొక శుకి. తెక్కలురాని చిన్నిపిల్లలఁ బెంచుకొను చుండెను.
ఆ చెట్టునకు దగ్గఱన యొక దట్టమగు వెలఁగ మ్రాను గలదు.
దాని కోటరంబులో (తొఱ్ఱ) విషములు గ్రక్కు గ్రాఁచొక్కటి
వసించు చుండెను. అట్లారెండును నుండ నంత నొక్కనాఁడు
తొల్లి తన పిల్లలఁగొనిచన్న క్రూరుఁడగు బోయ యొక్కఁ
డుల్లంబు పల్లవింప నల్లన ఆభూరుహ మెక్కి తన యల్లారు
ముద్దుపట్టియల రెంటిని జంచులు దెఱచి నఱచు చుండఁగా
నిర్దయుండై పట్టెను. అది కని శుకి శోకించుచు రోదించుచుఁ
బలవించుచు నోరునెత్తి మోఁదుకొనుచు వాని కిట్లనెను.

అన్నన్నా! యేమీ దురాగతము! తినఁబోయిన నీకుం
బక్షులు కఱవా? కన్నులు దెఱవని యీ చిన్నిపాపల మన్నిని
(జీవము) గొననేల? ఈ నిసుఁగులయెఱచి నీకు రుచియా
ఫచయా? విడువుము. పుత్త్రభిక్షపెట్టుము. ఆఁడుదాని నాద
రింపుము. అన విని బోయ యిట్లనెను. శుకీ! నీవేల గోలపెట్టె
దవు? నేనంత జాలిలేని వాఁడనుగాను. నంజుడుపై నాసచే
నీపిల్లలఁ జంపఁ బూనలేదు, నేను వీనినిగొని వెలవెట్టు వారి
కడకుఁ జని యమ్ముదును. వారును వీనిని విల్చి పెనుతురు.
కాని వీని కెట్టిపీడయు నొనర్పరు. నామాట నమ్ముము. అన విని
శుకి వానింగని "యోయీ నీకుఁ గనకముపైఁ గాంక్షకలదేని
వలయునంత బంగారము చూపెదను. నాపిల్లల విడిచి వుచ్చు
ము. లెమ్ము. రమ్ము. మొన్ననొక భాగ్యశాలి దొంగలకు

జడిసి యీయడవిలో నొక్కచోటఁ దవయర్థంబెల్ల దాఁచెను. అది నేను జూచితిని సత్యము. ఆడినమాట తప్పువాఁడను గాను. ఆ పసిఁడి నీకుఁ జూపఁజాలుదును. నన్నుఁ బుత్రుల నెల్ల వాఁడు గాచెదనని బాసయిమ్ము. వంతఁబాపి రక్షింపుము'' అనెను. అదివిని వాఁడు పెన్నిధిఁగన్న యట్లానందంబు నొంది 'శుకీ,' నీకుఁ గరుణించితి. నన్నునమ్ముము. ఇదిగో నీపిల్లల నీనీడంబులోఁ (గూఁటిలో) బెట్టుచున్నాను. రా యిదే నేఁ గ్రిందికి దిగుచున్నాను. అని చెట్టుపైకి యొక్కచో నిల్చి యురులు, బోనుబట్టుకొని ప్రమాణముచేసి తన్ను నమ్ముమని పలికెను. అప్పుడా యాఁడుచిలుక వానితో 'నోయీ! యేమిటి కీనమ్మికలు! నాచూపెడు సొమ్ములపైఁ జేయి పెట్టి సుఖమైన పిమ్మట నీవు ఖగమృగమ్ముల దుఃఖమ్ములఁ బాపఁ గమ్మఁబవత్తువా? రావు. కానీ వానికేమిలే. రా. యనిపలికి తోడ్కొని చని ఘోర భుజంగంబుగల యావెలఁగ మ్రాని వెడఁద తొలటను జూపి ''యోయీ! యిదిగో నిం దేయున్నది బోలెఁడు బంగారము. లోపలికిఁ జేయిపెట్టి దీసికొమ్ము. అని చెప్పెను. చెప్పఁగానె పాప మావెట్టిబోయ వలకేలందుఁ జొని పెను. చొనుపుటయే తడవుగా నా నాగుఁబాము గన్నుల నిప్పులుగ్రక్కుచు నా దిక్కుమాలిన బోయ చేతిపై నొక్కకాటు వెట్టెను. తోడనే వాఁడు దృష్టులు చీఁకట్లు గ్రమ్మఁగా నోర నుచ్చిళ్ళు గ్రక్కుచుఁ జచ్చి నేలఁగూలెను. చూచితివా! రాజా! ఆసచే నఖిలంబు మీఁదఁబాఱు పాపజాతి పసిండిమీఁద నేల పాఱకుండును. పసిఁడిపై నాసచే పాఱిన మనుజుఁడు తనకు వచ్చునాపద తలఁపఁ జాలఁడుగదా! తనచే నసాధ్యుఁడైన శత్రునిఁ దానేమియు నెఱుఁగక యట్లు

యుండి యన్యునిచేతఁ ద్రుంగఁజేయ వలయును. 'పరహస్తే సమాగయేత్త'ని కదా నీతికోవిదులు చెప్పుదురు. అని చెప్పి చారాయణుఁడు మఱియు నిట్లనియె.

"రాజేంద్రా! మేఖల పగవాఁడనైన నాయెడ మొగమోడి నామాటలు నమ్మి నిజంబరయ దయ్యెను. కార్యము మిగిలి చన్నది. ఎంతదుర్బుద్ధియో యోజింపుము. మొగమోట తప్పనను. మొగమోటకుఁ గూడఁ గొలఁది కలదు. అధికం బగు మొగమోట తగదు. మున్నొక్క యక్షుఁడు తన యిల్లాలి కెక్కుడు మొగమోటచూపి హతుఁడయ్యెను. ఆకథ యెట్లంటిరే వినుఁడు వినుతును.

యక్షపురమగు నలకా పట్టణమునఁ 'బ్రియభాషణుఁడను యక్షుఁడొకఁడు గలఁడు. వాని భార్య నిపుణిక. ఆమె పద్మాక్షి, అరాళ కుంతల, చంద్రవదన, బింబాధర, పసిఁడి బొమ్మయగుట నతఁడామెయందు బద్ధస్నేహుఁడై యుండెను. కొన్నాళ్ళకామె గర్భవతియై మగని గనులఁ దనియించు చుండెను. అత్తఱి నొక్కఁడా యూరియందు శ్రీకృష్ణుని యుత్సవము ప్రవర్తిల్లెను. ఆయుత్సవముఁ జూడఁ బౌర నారీ గణ మంతయు నేగెను. అది కని ప్రియ భాషణుఁడు తనప్రియురాలినిఁ బిలిచి "ఓసీ! నీవు కొండిక (చిన్న) దానవు. ఎన్నఁడును గ్రొత్తవినోదముఁ జూచినదానవు గావు. నాలుగు గోడలు దాఁటి యెఱుఁగవు. లెమ్ము. ఉత్సవము చూచిరమ్ము. పొమ్ము. నే నింట నుండెదనులే. అనుమానింపకుము." అన నామె "నాథా! నే నొంటిచనుట న్యాయమా? కాదు కూడ దందురా ! యీ నిండు చూలు మోసికొని నే నెట్లు పోవ

నేర్తును?'' అనుటయు నతఁడు ''రమణీ! నీ వటుఁ జనిరమ్ము. నీ వచ్చునంతదాఁక నీతాల్చినచూలు నేఁ దాల్చెదను.'' అని తన కుక్షి నామెచూలు దాలిచి యామె నుత్సవంబు చూడఁ బంచెను. పనిచినతోడనే యా కుటిలకుంతల చని కనులపండువుగా నా యుత్సవంబు చూచుచుండెను. కొంతసేపటికిఁ దిరునాళ్ళు చూడవచ్చినవారెల్లఁ దమతమ యిండ్ల కరిగిరి. కాని నిపుణిక రసాంతరమున మరిగిన మనస్సుతో నింటిమాట మఱచి, మున్ను విభుఁడు తనకుఁ జేసిన యుపకారము విస్మరించి, యాత్మలో ''నే నింటికి నేల పోవలయు? పోతినిపో పోయినదే తడవుగా వాఁ డెప్పటిగర్భము నాకుఁ దాల్ప నిచ్చును. అబ్బ! యా గర్భము మోవనేల? కంటికి నిద్రలేక యనయ నేల? వానిచేఁ గంటినా? తింటినా? మంటినా? వాని కుత్సిత బీజము వానిమీఁదనే త్రుంటితిని. ఇంక నా కొరుల దూఱు, పొగడ్తలతో నేమి లెక్క. చూలు దాలిచి వెక్కుచు స్రుక్కుచు నుండి ప్రసవవేదన పడనేల? జడ్డుపాలు కానేల? నా పాలిటిదైవము నన్నా దోసఁగునుండి పాపినది. క్రమ్మఱఁ బోవనేల? పోను. పోను'' అని తలపోసి నిశ్చయించుకొని, వేఱొక యక్షునిఁగూడి నిజేచ్ఛ నరిగెను. అంతట కడు పధికముగాఁ బెరుఁగుటచే యక్షుఁడు మోవలేక యూర్పు వెడలక పడఁతి దుడుకుఁదనమునకు వగచుచు ప్రాణంబులు తొఱఁగెను.

కావున భూపాలవల్లభా! యొరుల నెన్నఁడు నమ్మరాదు. తగువాఁని నమ్మిన నమ్మవచ్చును. కాని పగవారిని నమ్మరాదు. పగవారినైన నొకవేళ నమ్మవచ్చునేమో కాని మగువల

నెన్నఁడును నమ్మరాదు. కులకాంత కేళీవేళనుమాత్రము, నాథునకు బలువున మెలవున వెఱచును. కూర్చును. కాని దానిని నత్తిరెక్కించుకొనినచోఁ బతి కులంబును సొమ్మును ప్రాణంబున్నుగూడఁ జెఱచును. దాక్షిణ్యగుణ ముత్తమ మని సజ్జనులు దలంతురు. క్షుద్రులు తమకు దాక్షిణ్యము చేసిన వారినిఁ జుల్కనగాఁ జూతురు. నమ్మరాదను సమయంబున శత్రువును నమ్మి వానితోఁ గలిసిమెలసియుండి యడఁచుట నీతి. పిమ్మట నేమఱపాటులేక వానిని విడిచిపుచ్చి నమ్మక యుండవలయును. ఈ యర్థంబుదెలుపు నహిమూషికోపాఖ్యానము నెఱింగింతు నవధరింపుము.

నాగపురమున విషహారి యనువాఁ డొకఁడు గలఁడు. వాఁడు పాములఁబట్టి గరళంబు పిండి యమ్మి జీవించుచుండును. ఒకనాఁ డతఁడొకపాము నభీరుఁడై పట్టి యొక వెదురుఁ బెట్టియఁ బెట్టి దాని కెరగా నొక చిట్టెలుకఁ బట్టితెచ్చి యందు విడిచిపెట్టెను. వెంటనె సర్పమా మూషికమును గాంచి కబళింపఁ జన నది యదరుబెదరులేక పామును జూచి యిట్లనియె. "ఓయీ నాగకులావతంసా! తొందరపడకుము. నా కభయంబిచ్చి కావుము. నీకు మేలొనర్చెదను. నాతోఁ జెలిమిచేసితివేని నీ కార్యంబులు నా కార్యంబులు గూడఁ జక్కఁబడును. ఇద్దఱము భద్రముగా జీవింపవచ్చును. విషహారి పట్టినపుడె నేను జచ్చినదాన ననుకొనుము. చచ్చియున్న నన్నుఁజంపి చావకయున్ననీవు చెఱన యుండఁ దలఁచుట యెఱుక పాడియె? 'ఏ నధిక బలుఁడను. ఈ యెలుక సైకంబు. నాచేఁ గానిది దీనిచే నెట్లగును? ఇది నా చెఱ నెట్లు

మానుచుము? పట్టికల్ల' అని మనంబునఁ దలంపకుము. ఒక్కొక్కఁడొక్కొక్క కార్యంబున నిపుణుఁత గలిగి యుండును. దానియందు వీఁడు పూజ్యుఁడు; వీఁడు హీనుఁడు ననవలదు. సూది నయ్యెడు పని కటుతచే నగునా? అయోగ్యుఁడైనను దనవాఁడ ననినవానిని బ్రోచునుగాని వెలార్పఁడు. కాన నభీష్టప్రజాతయెడ వేడుక సేఁత నేర్పగును. గాలపు వేఁట కాఁడు మీాలమీాఁది యాసచే నీళ్ళపైఁ దేలెడు దృష్టిమీాఁదఁ దనదృష్టియు (బుద్ధి) నాదరంబుతో నిలుపునుగాని మలుపఁడు. తన కార్యముకొఱకై హీనునియొద్ద కైనను జనఁ జనును. స్వార్థమూఁది సద్బ్రాహ్మణుఁడుగూడఁ జండాలునింటికి నుప శ్రుతికై వెడలుట లోకవిదితమ కదా! నా చెప్పినట్లు చేసితివ యేని నీ చెఱ విడును. అట్లుఁగాక నిలుపోపక నన్నుఁ జంపి నోరను వేసికొందు వేని దాన నీ యంగద (ఆఁకలి) యాఱదు. నేను జెఱఁబాపఁగానె నీవు యథేచ్ఛగా నెందేనిఁ గ్రీడింప వచ్చును. చిఱుగప్పలఁ జప్పరింపవచ్చును. మీాలం గ్రోల వచ్చును. ఎలుకల నాహారింపవచ్చును. చెట్టెలుకలఁ దిన వచ్చును. తెమ్మెరలఁ గుత్తుకబంటిగాఁ బీల్చి హాయిగా విశృంఖలవిహారము సలుపవచ్చును. కావున నామాట గీటునం బుచ్చక నెమ్మది నెమ్మళముగా యోజించుకొనుము.'' అను టయు నురగము సంతసంపడి 'యెలుకలరాయఁడా! స్వప్నం బునఁగూడ నేను నీకుఁ గీడొనరింపను. నీవు నా చెలికాఁడవు. అనుమానము దక్కుము. ఆనందంబును బొందుము. నా యీా కరండినిగ్రహ ముడిపి పుణ్యంబునఁ బొమ్ము.' అనుటయు నెలుక 'ఓయీా! పాములతేఁడా! నేను నీతలపైనుండి యొకమంత్రము జపింతును. జపము చాలింపఁగానే నిన్నుఁబిలుతును. అందాఁక

కదలక మెదలక పదిలముగఁ గనులు మూసికొనియుండుము.' అని నియమించి దాని శిరము జంకు గొంకు లేక యెక్క కరండ నిగ్రహము ననువుగఁజేసి భద్రంబగు నొక లాఁగఁ (బొఱియ) జొచ్చెను. వెంటనె పాము కనులువిచ్చి చూచి సంతసము వంత గదుర యెదుటనున్న యొక్క బొక్కలోనికిఁ జని తనలో 'నన్ని యెలుక కపటమునఁ గనులుమూసినది. నో రెరియఁగ మ్రింగనై తిని. ఎందుల కీదిక్కుమాలినబ్రతుకు. చచ్చిననేమి ? బ్రతికిన నేమి?' యని తలఁచెను. దురాత్ము లకుఁ దగవులకు నెంతదవ్వు ? ఖలుఁ డొల్లకుఁ గీడుచేయ సమ కట్టి తనకుఁ గలిగెడు నిండ్రత్వమైనఁ గా దనును. చావునై నను బాటింపఁడు. కావున నాయ్యాశీవిషంబు (పాము) దాని బిలద్వారం బెఱింగి, యమ్మూషకంబునకు దోషం బాపా దించు నభిలాషంబుతో దాని బొరియకడకుఁ జని, 'సఖా ! మూషకోత్తమా ! రమ్ము! తొరగా రమ్ము ! మన మిరువుర మొక్క చో నుండి యుచిత సల్లాపములు గావింతము' అని పిలిచెను. అది విని యెలుక పెక్కు లాఁగలుగలిగి చక్కని లోపలిభాగముగలిగి తన్నంటవచ్చిన పామును దప్పించుకొని పట్టువడక లోపల డాఁగి చని వెలికి వెలువడి పోఁగల కను మలు (సందులు) గలుగు నొక్క బొక్క యెదిరికివచ్చి మట్టిచే బద్ధమైయున్న బిలద్వారంబున నిల్చి, యా రెండునాల్కల శిఖండిపాముతో నిట్లనియెను. 'అన్నా ! పన్నగవరేణ్యా ! నీవు మున్ను నన్నుఁ గాచితివి. నిన్ను నేను జెఱ వాపితిని. నాపై మున్నున్న కరుణవీఁడక మన్నింపుము. నాకా గౌరవము చాలును. కనకాభిషేకము గావించినట్లు సంతసింతును. విద్యమునకుఁ గయ్యమునకు నెయ్యమునకు సమతే వలయు

ననికదా పెద్దల సుద్దులు. ఎత్తువారితో స్నేహంబుసేంత తగదు. నేను హీనబలుండ, నీచెలిమికి నెంతవాఁడను? నీవు నాకు నాగర్భవైరివి. మన మిత్రత్వము కార్యార్థమాత్రము. ఇన్ని మాటలేల నన్ను మన్నించి మిన్నక పొమ్ము. నిన్నుఁజేర వెఱతును! అనుటయు నా యురగము సిగ్గువడిపోయెను. ఆ మూషకంబును సుఖంబుండెను. అని చారాయణుఁ డెఱింగించెను. పిమ్మటఁ దనవలన మహీనాథుని వృత్తాంతము సమస్తము విని భాగురాయణుఁడు బోధించి, పంపఁగాఁ గలావతి యొక్కనాఁడు రత్నసుందరి పనుపునెపంబునఁ గేయూరబాహుఁడు చారాయణసహితుండై యుండునెడ కేతెంచి మ్రొక్కెను. రాజు దానింగాంచి యది దేవీప్రేరితయై తన భావవృత్తి యరయవచ్చినదిగాఁ దలంచి, ప్రసంగవాక్యంబుల నింగితంబు నొడిచికొని, గారవించి, సుఖాసీనంజేసిన, నది సంతసించి, మోమున మందహాసము మొలకలెత్త నిట్లనియెను.

రాజేంద్రా! మీ మందిరంబున నేకతమున నేమో యాడుకొనుచుండ నీ యఱుత హారంబొక్కండు చేయూరవై చితిని. నా నేర్పుల మీరెట్లు మొఱఁగఁ (వంచింప) నేర్తురు?

అనుటయు భూభుజుఁ డా (రాజు) శ్చర్య సందేహ సంతోషంబులు మనంబున ముప్పిరిగొనుచుండ దాని కిట్లనియె.

కలావతీ! చారాయణుఁడును నీవును నా కొక్క రూప. నిన్నిక్కడ నెవ్వరు వారింపరు. ఇం దన్యు లెవ్వరును లేరు. ఇంతకు నీ హారం బెవ్వరిది? చెప్పుము. నీకు మాయందు దాఁపురము చేయు నర్థ మొక్కటియు లేదుకదా!

అనుటయుఁ గలావతి యిట్లనెను. 'రాజా! విను. లాట భూపతికి మృగాంకావళి యను ముద్దులపుత్త్రిక యొక్కతె కలదు. ఆమె చక్కనిచుక్క. ఆమెను జిదిమి దీపము పెట్టవచ్చును. ఆమె లావణ్యము అనన్యసామాన్యము'.

ఆ పలుకులు విని కేయూరబాహుఁడు కళావతితో లాటేశ్వరుం డగు చంద్రవర్మకు మృగాంకవర్మ యను పుత్త్రుండొక్కరుండు దక్కఁ బుత్త్రిక యెక్కడిది? యనిన నది నవ్వుచు నలుఁగెలంకులు పరికించి యిది యొక్క యత్యంత రహస్యంబు. దాని నియమం బవధరింపుమని యిట్లనియె.

'మహాప్రభూ! లాటదేశాధిపతి పుత్త్రికను గాంచి యది శత్రులకుఁ దెలిసిన తన సామ్రాజ్యము వారి యలుకకుఁ బాత్రమగునని తలంచి యా పుత్త్రికను బుత్త్రుఁడుగాఁ బ్రకటించెను. ఆ రాజు సుబుద్ధి కావున, నింతకుమున్ను తన కొలము సాముతెల్ల నేకసంతతులయిపోయిన పోక మెఱింగినవాఁడు. దానం జేసి తనపుత్త్రిహీనత పరదేశరాజుల మనంబున కెఱుకపడకుండ సమర్థతతో మంత్రరక్షణము గావించెను. దేశంబు నలుగడల వాని సుతత్వము ప్రసిద్ధిగ మ్రోసెను. అ య్యపత్యంబు నామంబు మృగాంకావళియైయుండ మృగాంకవర్మ యని పుంస్త్వంబు దోఁపఁ దదభిధానంబుతోఁ బిలుచుచుండురు. అక్కన్నియఁ జేపట్టినవానికి సార్వభౌమత్వంబు కలుగునని మహాపురుషాదేశంబు. ఈ రహస్యంబు సర్వంబు కుశాగ్రబుద్ధియగు నీ మంత్రి భాగురాయణుం డెఱుంగు. నీ రాజ్యంబు నభివృద్ధిచేయుతలంపున నాతం డాకుమారీరత్నంబు నిందులకు రావించియున్నాఁడు. దేవర యక్కన్యారత్నం

బును వరించి సార్వభౌమత్వంబు నొందవలయు. ఆమె యిప్పుడు నీ మంత్రిపుంగవుని మందిరంబున నున్నది. రత్న సుందరియం ద్రాతఁడు భయభక్తులుగలవాఁ డగుట న ద్దేవి వలని దాక్షిణ్యావిశేషంబున నీ కెఱిఁగింపనేరక యున్నాఁడు. అమ్మహామంత్రి నియోగంబున నేను నీ ప్రియురాలి కెఱుక పడకుండ మృగాంకావళికి నెచ్చెలినై వర్తిల్లుచున్నదానను. రాజా! మాటలు వేయు నేమిటికి! ఆ మదిరాక్షి రూప విభ వాతిశయంబులు చూచినఁ జాలు సోముని మఱొక సోముఁడు, కాముఁడు మఱొక కాముని, నామని (వసంతుఁడు) మఱొక యామనిని, కాముఁడు, మఱొక కాముని, సమీరుఁడు మఱొక సమీరుని వేఁపక మానరు. ఆమె తనులత తొడవులకుఁ దొడవు. ఆమె నడుపులు తొడవులకును, దనులతకునుగూడఁ దొడవులు. ఆమె నుడువులు తొడవులకును, దనులతకును, నడుపులకునుగూడ దొడవులు. ఆ చేడియ సౌందర్యము నాచేఁ జెప్పించుకొని వినవలయునని వినుచున్నావుగాని ముందఱ నీవు చూచినయదే కదా!' యని యామె పలుకఁగానె రాజు మృగాంకావళి 'నమః ప్రసవశరాసనాయ తే' యని తన తార హారము తన (రాజుయొక్క) కంఠమున వైచిన విషయంబు మనంబునఁ దోఁచి, యామె పలుకు లమృతముక్రియఁ దన వీనులు సొచ్చి డిగి హృదయమంతయు నిండఁగా నొం డెఱుఁ గక యవశుఁడై ప్రణయసముద్రమునఁ దేలెను. అది కని చారాయణుఁడు సంతోషితస్వాంతుఁడై కళావతిశిరం బక్కున (ఱొమ్ము) నదిమి పెక్కు తెఱంగులఁ బ్రశంసించెను. అప్పుడు మేదినీనాథుఁడు కళావతీ చారాయణుల బహువిధంబులఁ గొనియాడి బహురత్న భూషణాంబరాదికముల సంతోష

పూర్వకంబుగా నొసంగి సత్కరించెను. అది కని కళావతి రాజు లాటరాజనందన యటమీఁది వృత్తాంతంబు చిత్తంబున హత్తింపఁ గుతూహలాయత్తుఁడై యున్నాఁడని యెఱింగి మఱియు నిట్లనియె.

ప్రభూ! ఆపె యట్లు దేవరచే గృహీతయయ్యును, నట మున్న నాచే బోధిత యగుటంజేసి కులపాలికాధవంబైన ధైర్యం బవలంబించి, యెట్టకేనియు విడిపించుకొని, యామె పడకటిల్లు సుషిర స్తంభకుడ్యరచితంబు గావున, యంత్ర స్తంభాంతరితయైన య య్యరాళకుంతలను వీడ్కొని, తత్సదనంబున మానితప్రభాతం బగుచుండ నేను మా యింటి కరిగి యొక్క క్షణకాలంబుమాత్రంబందు మసలి మరలి తన(ఆమె) యున్న తావునకుం బోవ న మ్మానవతియు, నంతకమున్న బహువిధ వికార మగ్నమానస యగుచుండిన, వలవంత సకలంబు నాకు వెలిఁబుచ్చ సిగ్గువడి పద్యత్రయంబుగా రచించి యొక్క మొగలిఱేకుపై లిఖించి, యేమరి, పడవైచినట్లు పడవైచి, ననుం గనుంగొని మిథ్యానిద్ర నభినయించుచు, నవ్వాలిమొగంబైన నేను జేరంజని, య క్కేతకీపత్రగతం బగు పద్యత్రయంబు పఠించితి. నది యెట్లంటివేని విను.

"తాడిడి పండుఁదిన్నక్రియఁ దద్దయుఁ గాలముగోరుచుండఁగాఁ
జూడఁగవచ్చు నేన్నృపతిసుందరు నింకొకమాటు గ్రమ్మఱన్
జూడఁగనైన నోఁచునొకొ, చూడ్కి కళావతిదేవి కాత్మలో
నోడి ప్రమాదకార్య మిదియొప్పదు పొమ్మనునొక్కొ దైవమా!

ఇట నటఁ జూడరాదతని నింతయొకప్పుడు నాడునిండ ముం
దటఁ బ్రొలయంగ నీకిది ప్రధానుఁడువల్కఁగఁ జామయిద్ది నీ
చిటిపొటి పొన్నచుక్కలకుఁ జేతులు సాచుటగాదె యిట్టి దు
ర్ఘటనపుఁ గూర్మికిన్ శరణుగల్గునె యెట్లు దలంచి చూచినన్.

ఒంటియయుండి తేయి విభుఁ డుల్లమునం బ్రియమార నన్ను నీ
బంటుగ నేలికొమ్మనుచుఁ బట్టినయప్పు డదేల యియ్యకో
కుంటి వృథాభిమానమున నుంటఁ గళావతిమాట లేమిగా
వింటెఁ బ్రసూనసాయకుని వింటి దృఢత్వముఁ గంటి బేలనై!"

అని చదివిన విని రాజు సానందహృదయుఁడును, సదయుఁడును, లజ్జావదనుఁడును నయ్యెను. అది కని కళావతి యవధరింపుము రాజా! యవ్వలి వృత్తాంతమని యిట్లు చెప్పెను.

అప్పద్యంబులు చదివిన నేను దాని వికారంబునకు హృదయంబున నదవద (కలఁత) చెందుచుండ నమ్మదిత నిద్ర తెలిసినదియవోలె నన్నుఁ గారవించుచు సెజ్జనుండి డిగ్గి భాగురాయణుని నిష్కుట (ఇంటితోఁట) కూటంబులోనికిఁ బోవు తలంపునఁ బిల్చిన నేనును నట్లైనను, బ్రొద్దుగడపుట కార్యంబని యనుమతించి యరుగ నందుఁ బ్రవేశించి యెలదేఁటిగముల యొఱకలఁబడ నెక్కు పయిపయిఁ గ్రమ్ము పూఁదేనెల సొబగును, గోకిలదంపతులకుఁ దల్పములగు చిగురుజొంపముల పెంపును, కలికిరాచిలుకల పణ్యానిలంబుల నలుదెసల రాలు ఫలచయంబును, బుష్పాఢి తావితోఁ బాదరిండ్ల బయళ్ళు పూరించిన మందమారుతంబును, మది తాపంబు నంతకంత

కగ్గలంబుచేయ బెగ్గడిల్లి తలపోఁతలకుఁ జొచ్చి, చిత్తంబు స్వాయత్తంబుగాక యిష్టసంచారకేళికి నెలయలేక యొక్క లతాకుడుంగంబు సొచ్చెను. తొల్లి తాను హారము వెట్టుకొను చోట నీ యంగుళాగ్రములు సోఁకుట తలంచి యాకలికి దలం బుగఁ బులికించును. ఆమె మోము వాడెను. కన్నులు బాల రసాసాలవాసంతికా లతికలు సూడ నోడెను. నిట్టూర్పు లిట్ట లము (అధికము) లయ్యెను. తనూవల్లిని దాపము దీపించెను. గోష్ఠీవిహారము వీడుకోలు వడసెను. తాలిమి పోఁడిమి మాలెను. మేను డస్సెను. క్రిస్సెను. అట్లుండ నెట్టకేలకు దినంబుగడచి రాత్రి కొంతసనుటయుఁ బూవిలుతు నిష్టసఖుఁ డగు చంద్రుఁడు వియోగుల వేఁప మిన్నెక్కి నిక్కెను.

పండువెన్నెల లెల్లెడ నిండి కాయదోడం గెను. ఆ రేయెం డలో నంజనగిరినిఁ గాంచి గిరిశుఁడు తుషాద్రి యని తోరణ కట్టఁ బంపెను. అమర గంగాస్రవంతి వెల్లువ యని యగస్త్యా దులు వట్టిబయల నెచ్చట నైనఁ గ్రుంకు లిడిరి. బ్రహ్మయు గుహుఁడును (కుమారస్వామి) తమ వాహనములు దడ బడఁగా నలిగి వాదడచి సత్యముల కరగిరి. విచికిల(మల్లె) ప్రసవంబువెదకెడు తేఁటి చీఁకటిభ్రమాఁకుల విరులలో మసలు చుండెను. చేతనాచేతము లావెన్నెల బిసనాళములఁ బీల్చ సాగెను. దోసిళ్ళఁ ద్రావఁ గడఁగెను. కుండలనిండ ముంచ నెంచెను. అట్టియెడ లాటరాజపుత్రి మూర్ఛితయైనది. నేను భయపడి చెంగలువదండలఁ జెఱకువిలుకానిఁ బూజించి, నా నెచ్చెలిని రక్షింపుమని ప్రార్థించితిని. అది కని నా చెలి దైన్యగర్భహాసంబు దెచ్చికొని యీ పూజలు చాలించు. ఈ

యలరఁ బాన్పులు వెన్నెలతోఁ బొంగి నిజనివాసంబునకుఁ బో
దము పద. మన కెవ్వరితో నేమిపని యని మూదలించినది.
నేనును దానిమాఁనతి నౌదలఁదాల్చి యామెను నివాసహర్మ్య
మునకుఁ దోడ్కొని యరిగితిని. ఆ త్రియామ, సహస్ర
యామమై కడచినది. ఇది వృత్తాంతంబు. పిమ్మటిదెల్ల నీవ
యెఱుంగుదువని పలికిన రాజు కళావతికి మఱియుఁ బసదనం
బొసంగి వీడుకొలిపి చారాయణుఁ జూచుచు మిత్రమా!
'మున్ను నేఁగన్నది కలయో, నిక్కమో యెఱుఁగను. తుద
కది నిక్కంబైనది. కాని యేతన్వియో తెలియఁజాలనైతిని.
ఇప్పటికి సమస్తకార్యగతులు తెల్లంబు లయ్యెను. కులశీలా
దులఁ దుల్యయైన యీ సతిని దైవంబు నాకుఁ జేకూర్చెను.
ఇఁక నా కన్యారత్నమును బెండ్లియాడుట యెట్లో కదా!'
యనుచుండ భాగురాయణుఁ డొక్క చతురోపాయంబుగఁ బరి
పుచ్చ (పంప) నొక్కనాఁటి రేపు కళావతి రత్నసుందరిని గొలు
వం జని మేఖలాద్వితీయయైయుండ నద్దేవితో నిట్లనియె.

దేవీ! మనరాజు విదూషకుఁ గొని మనమేఖలను మోస
పుచ్చెను. మనమిప్పు డాపనికి మాఱుసేఁత చేయవలయును:
ఏతన్మూలమున రాజచంద్రుని వెలివెట్టవలెను. అన విని
రత్నసుందరి సంతసిలుచుఁ 'గళావతీ! యే యుపాయంబునఁ
జారాయణుని నాయన రాజుగారిని మోసపుత్తువు చెప్పుమన
నది యిట్లనియె.

'అమ్మా చెప్పుటకేమున్నదమ్మా! మనరాజు భోగైక
లాలసుఁడు. కావున నేమిచెప్పినను నమ్మును. అన్నము
పున్నము నెఱుఁగఁడు. చంద్రవర్మని కొక్క చక్కని

కూఁతురు గలదు. ఆ శుభాంగి మన మృగాంకవర్మ ఆ కుమారిక కరము వట్టినవాఁడు సార్వభౌముఁడగును. ఇది యొక సిద్ధుఁడు చెప్పెనని యార్యులు చెప్పఁగా నేను వింటిని. ఈ సంగతి నేను రాజునొద్దకేగి వినిచి, 'రాజా! నీవుండ నొరుఁడు సార్వభౌముఁడగుట నేను సహింపను. కాన నీ వాపుత్తడి బొమ్మను జేపట్టుము. సార్వభౌమత్వమందుము. అని విన్నవింపఁగలదానను. అనుట రత్నసుందరి 'అట్లైనఁ గళావతీ! నేను సార్వభౌముని నగ్రమహిషినై యఖిల నరేంద్రవల్లభాభిసేవ్యనై యుందును. కులపాలికలకు నేయుపాయంబునఁ గాని నాథు నభ్యుదయంబుగోరు టుచితంబు. ఆరాచకన్నెయ మా పినతల్లి కూఁతురగుటను, నిది నాకావించిన పరిణయంబగుటను, నా మానసంబున నీసు పుట్టదు. ఇవ్విధంబు చేయుట నా యభిమతంబులు సకలంబులును జేయుట యిక్కార్యం బంగీకరింపకునికియు, నాచనవులెల్ల నంగీకరింపకునికి యని నరనాథునికిఁ జెప్పి యొప్పించునది యనుటయుఁ గళావతి దేవీ! యట్ల గావింపఁగలదానను. మృగాంకవర్మ యజాతశ్మశ్రూదయుండగుట (మీసలు గడ్డము లేనివాఁడు) నతని నేను వనితా శృంగారంబుల లవరించి తదీయానుజ యని భ్రమాయించెద. నిక్కంపు వివాహం బునకవోలె వివాహద్రవ్యంబులు సమస్తంబులు సమకట్టుఁడు. ఇవ్విధంబున మాయలుపన్ని యత్నేదుకాని మోసపుచ్చి, చారాయణుని దలయెత్తకుండఁజేసి, మేఖల భంగంబు నీఁగికొందము. ఇది రాజు భేదింపలేఁడు. నమ్మెదును. చూడుమన దేవి యది యట్టిద యని సంతసించి కళావతిని గౌఁగిలించుకొని బహూకరించి చెలీ! యీపని యభేద్యముగ రచింప నెవ్వరికిఁ బుత్తమనినఁ

గళావతి యించుక యోజించి, మేఖలను బనుపుమనెను' అది విని దేవి యించుక విచారించి, 'కళావతీ! నీవు సుగుణాల వాలవు. నీవలె మేఖల యిక్కార్యం బచ్చుపడ పలుక నేరదు. నా ఖేదము, క్రోధము ండకోడుకగు చారాయణుని మదము నీవ చని పుచ్చవలయును. అన్యులవలనఁ గాదు. నా కీపని చేసిపెట్టుము. ఇంతమాత్రము చనవు కేను దగనా?' యని దానిచేతులు పట్టుకొని బ్రతిమాలఁగా నది 'బాగుగా నున్న దమ్మా! రాజునకు మందు చెప్పినవారికథయయ్యె నా బ్రతుకు. కానిమ్మట్లే చేయుదునని కదలి నరనాథు నొద్ద కేఁగెను. అపూర్వంబుగాఁ బొడసూపిన దానిని గాంచి రాజు గారవించి, సమీపంబున నునిచికొని దాని మొగంబు పొలఁకువ తిలకించి చారాయణా! మన కళావతి యపూర్వ సంతోషవతియై యున్నది. యీ సంతసంబు మనకుఁ దెల్పవలెను. వినవలతు ననుటయు నది 'రాజా! సంతసములు పెండ్లివేడుకలను గడవ లేవు. రాజుగారి పెండ్లికి ముసలికి సంతసములు కొఱఁతయే? యన, విని రాజు సందియంబుతో నించుక యలరుచు దాని కిట్లనియె.

కళావతీ! నీవు తలఁచికొనిన మేఘములలోని రహస్యము గూడఁ బుణికి పుచ్చికొనఁగలవు. అస్తగిరికిఁ దామ్రపర్ణికి సంగమము ఘటింపఁగలవు. నిన్ను మించిన బుద్ధిమతి మఱొ కతె నే నెందును గని విని యెఱుంగను. ఏమిటి నీవు వచ్చు చునే కళ్యాణ సంతోషములని యాడితివి? చెప్పుము. అనినఁ గళావతి భాగురాయణోపదేశంబునఁ దాను దేవిం బ్రబోధిం చిన ప్రకారంబు రాజును జారాయణుందును గొండాడుకొను

చుండఁ దద్దయు సవిస్తరంబుగా వినిపించి యాపని ఘటింపఁ బూని తానవచ్చుట యెఱింగించినఁ బరమానందంబున ధరణీ కాంతుఁ డక్కళావతికి నత్యాదరంబునఁ గట్టనిచ్చి దేవితోడ నీకుఁ దోఁచినట్లాడుము. ఇటమీఁది కర్తవ్యంబు నీకుఁబోలి నట్ల చేయుము. అని వీడుకొలిపి భాగురాయణు బుద్ధిపాట వంబుఁ గొండాక కొనియాడి 'చారాయణా! దేవి యీరీతిని మోసపోవునే? ఈ కార్యంబు నిర్విఘ్నంబుగాఁ గొనసాగునే? లాటరాజపుత్త్రికా చరిత్రము నిచ్చట నొరులెవ్వరు విన కుందురుగదా? యనఁ జారాయణుఁడు 'రాజా! దేవి నన్నుఁ బేలువెట్టుదు నను తమకంబున నెద్దియు నెఱుంగదు. కావున నిది యవశ్యము సిద్ధించు ననెను. అదివిని రా జారట చెందెను.

అట్టఁ గళావతి వికసితాననయై దేవికి మ్రొక్కి 'తల్లీ! మీయాయన నొడఁబఱచితిని. ఆ మోసకానిఁ జారాయణుని మాయాజాలంబునఁ గట్టిపెట్టితిని. ఇఁకమీఁదటి పని యొన రింపుము. రహస్యంబు పొక్కనీకుము. అనుటయు సంతసిల్లి దానికి నవ్యాంబర భూషణాదు లొసంగెను. అంతఁ గళావతి భాగురాయణు నొద్ద కరిగి యవ్విధంబంతయు వినిచి వాని యనుగ్రహంబు వడసి చని మృగాంకావళి కది యెఱింగించి మహానందంబునఁ దేలు రాజనందనచేత మెప్పులు గొనెను.

ఇట దేవి యప్పుడ ముహూర్తకు రావించి యతనిచే నద్ది నంబునఁ బూర్వాహ్ణంబున నతివిశిష్టంబగు లగ్నంబు గలుగుట విని యాప్రొద్ద వివాహంబని క్రమ్మఱఁ గళావతిచేతఁ జెప్పి పుచ్చి తదనుమతోత్తరంబున ముదంబంది పట్టంబు నగరు నలంకరింపవలసిన పనులకు నాయాయి పనివారినిఁ బనిచి

మృగాంకవర్మకుఁ గాంతాలంకార మలవడఁజేయు మని కళావతి నతిప్రయత్నంబున నియోగించి, రాజును గైసేయ నభినవ ప్రసాధన నిపుణులగు చతురుల కానతిచ్చెను. ఆప్రొద్దు సర్వంబు సంసిద్ధంబై లగ్నం బాసన్నంబయ్యెను. అత్తఱి వివాహమండపము రావియాకుల తోరణములతోడను, కుంకుమ రసలిప్తతల ముక్తారంగవల్లికలతోడను, గాయలతోఁ, బూవులతో, ముత్యాలతో వ్రేలు విచిత్రవితానంబుతోడను, మంగళద్రవ్యముల హేమపాత్రికలనుంచి యొయ్యారంబుగ నిలిచిన పుణ్యాంగనాచయంబుతోడను, వేదఘోషలు సలుపు విప్రగణముతోడను, మాణిక్య దీపములతోడను, గలకల లాడుచుండెను.

అంత రాజ్ఞియాజ్ఞచే రాజును రాజసుతయుఁ దమచూడ్కులు చూపఱను మొఱఁగి యొండొరులపైఁ బఱఁగి కృతార్థత చెందుచుండఁగా వేడుకలు మితిమీఱఁగా నూఱటల వేగము చల్లఁబఱచుకొనుచీతిని. ప్రమోదరసవారిధి యది యిరుమేనులైనట్లు సమంత్రక కృత్యములను గ్రమంబుగఁ జేయుచు వేదికపై హోమంబు చేయుచుండ దేవియు నాప్త పరిచారికలును ముసిముసి నవ్వులు నవ్వుకొనుచుండ భాగురాయణుఁడు సనుదెంచి రత్నసుందరిచే నుపచారంబులఁ గైకొని యుచితస్థలంబున నాసీనుఁడై యాయమ నుద్దేశించి 'దేవీ! చంద్రవర్మమహారాజు సతి సుధామదేవి నీపేర లేఖ పుత్తెంచె నని చెప్పుచువచ్చి యొక్కఁడు మననగరి మొగసాల నిలిచి యున్నాఁడు. వానిఁబిలిచి తేరఁబంపుఁడు' అనుటయు దేవి తన పరిచారికవంకఁ జూడ నదిచని వానిని దోడ్తెచ్చెను.

వాఁడును వచ్చి దేవికి మ్రొక్కి హరిద్రాముద్రంబైన తనచేతి లేఖ యిచ్చిన నది చదివించి యందు సుధామమహాదేవి తన యకు రత్నసుందరికి స్వస్తిపూర్వకంబుగా శుభోదర్కంబుగాఁ బలుకనదేమన. నీకిప్పు డొక్క చిట్టితమ్ముఁడు గలిగెను. మున్ను నీపురమున నున్న యామ్రాంకవర్ముఁడు నీకుఁ జెల్లియలుగాని తమ్ముఁడు గాఁడు. తొల్లి మాకు సుతులు లేకునికిఁ జేసి మగపేరు మ్రోయఁజేసి పెనిచితిమి. ఇప్పుడక్కన్యను దగు పతి కీవయిమ్ము. దానిఁ బెండ్లాడిన భూపతి సార్వభౌముఁడగును. ఇది మునివర భాషితము. సత్యము. అనియుండుట విని యదిరిపడి ఔచ్చవోయి, వెల్లవాటి ముచ్చముడిఁగి మూర్ఛ ముంచికొనిరాఁగా ధైర్యంబూఁతగా దాని నాఁగి 'అయ్యో యిదియేమి తెచ్చిపెట్టుకొంటిని. ఉన్నట్లుండక కొఱవిగొని తలగోఁకి కొంటిని. జనులెల్ల నన్ను మతిలేని దాన నని నవ్వెదరు. సవతిరాక మాట దేవుఁ డెఱుఁగును. తోడివారిపోటు మాటలెట్లోర్తును' అని పశ్చాత్తాప పీడితయై యిది విధికృతం బింక దీనికి ధైర్యంబందమి యేలని మెచ్చ నకు ధైర్యంబు దెచ్చుకొని ధీరయగుట నవికారయైయుండెను.

కార్యమూల మెఱుంగక యొరులకఱపు మదిని నమ్మి తమకు నయ్యేఱుకలేక యొరులను బఱచెదమని పోయి రత్న సుందరివలె నొరులచేతఁ దామె పడుదురు.

భాగురాయణుఁడు తన యుపాయంబు సఫలంబగుటకుఁ గరంబు ప్రియంబందెను. పరముఖమున విరచించెడు మంత నము వెలిపుచ్చక నేర్పరియై భాగురాయణునివలెఁ గార్యము లెల్ల ననుష్ఠింపవలయును.

అనంతరంబు మృగాంకావళీ కేయూరబాహులు కర్పూర కస్తూరికాదుల గుమగుమలాడు హర్మ్యములందును, శుకపిక కోకిలాలాప సుందరములగు నుద్యానములందును, మత్త మయూరములకు నృత్త మందిరములైన కేళి శైలములందును కర్పూర కదళికాలంకృతంబులగు దీర్ఘికా తీరములందును నంతకంతకు నాదటలగ్గలింప వేడ్కలు నాటుకొన, నింపులింపార సొంపులుదీపింప నభిమత క్రీడలఁ దేలుచుండిరి.

ఇట్లు లబ్ధ మనోరథుఁడై కేయూర బాహుమహీకాంతుఁడు విపక్షుల శిక్షించుచు లోకనిందలకు జంకుచు, ప్రజ కబాధకంబుగా నరి (పన్ను) గొనుచుఁ దప్పరయుచు, ధర్మంబు గాపాడుచు, భృత్యుల బంధువు లట్లరయుచు, ధర్మంబు నాలుగుపాదంబుల నెఱపుచు, సత్యంబు పాలించుచుఁ, బరకాంతల తల్లులవలెఁ గాంచుచు, రోఁతలుదలంగుచుఁ 'గార్వ్య లోభ జాడ్య కపట వ్యసనములఁ దొఱంగుచు, నాయవ్యయముల నెఱుంగుచుఁగలఁగక, యుబ్బక, భీతిలక, కలుషపడక, యేమఱక, మొక్కలపాటుపొందక, వెఱఁగుపాటులేక, చలముతొఱఁగి విషయలోలుఁడుగాక సుజన స్తుత్యంబుగ ధరాపాలనంబు చేయుచుండెను. అంతియ కాక యతఁడు తన మేలు నేల నలుచెఱంగులను దన నగరిలోపలివలెఁ దెలివి పడఁజేసెను. ఏది మరు దేశములో(ఎడారు)యేది, జాంగలమో (మెట్ట) యేది సమతలమో, యేది సారమో, యేది యసారమో, యెచటఁ గొండలున్నవో, యెచ్చట నడవియున్నదో, యెఱింగి, యెల్లకాలంబులకుఁ దగినట్లు దుర్గంబులు బలుపు చేసెను. మఱియు బలవంతులైన సమీప భూపులలో సబలుని

నబలుని, మిత్రుని, శత్రుని, నరసి చతురుపాయంబుల వారిఁ జక్కఁజేసెను.

స్వామి, మంత్రి, దుర్గము, రాష్ట్రము, వనము సుహృదులు, బలము, ననుసప్తాంగముల నారసి రక్షించెను.

స్త్రీలోలతచే సింహబలుఁడు, జూదంబుచే ధర్మరాజు, నలుఁడును, అధిక పానాసక్తిచే యాదవులును, వేఁట తమకంబునఁ బాండు దశరథులును, బలుకు ప్రల్లఁదనమునఁ (వాక్పారుష్యము) కౌరవులును, దండంబుపరుసదనమున జరాసంధుఁడును నాపదపాలగుట యెఱింగిన వాఁడగుట సప్తవ్యసనములను దగులక సార్వభౌమత్వ మందెను.

బుద్ధి శస్త్రము, సంప్తాంగములు మేను, గార్యయత్న రహస్య రక్షణము జోడు, చారులు దృష్టులు, సూతజనము ముఖము, ధర్మవర్తనము ప్రాణముగ నేల నేలుచుండెను. అంత నొక్కనాఁడొక్కజడదారి యాయొడయఁడున్న యెడ కరుదెంచెను. అతడు శార్దూలచర్మంబు నిర్మలంబుగఁదాల్చెను, వాని మేనెల్ల విభూతి మంగళస్నానముచేఁ బవిత్రమై యుండెను. చెవుల రుద్రాక్షమాలికలు చౌకళించుచుండెను. ఉరమున యోగపట్టె మెఱయుచుండెను. చేతఁ కమడలువును దండను లోహావుఁ గడియమును కక్ష్యను యోగదండమును మెఱయుచుండెను. అతఁడు కేవల యోగిగాఁ గానవచ్చుట లేదు. వాని మోమున బ్రహ్మతేజం బుట్టిపడుచుండెను. వానిఁగాంచి యుఁ గాంచుటతోడనే యాతేఁడు దిగ్గన యాసనంబు డిగ్గనుఱికి యెదురుగానేఁగి నేఁటికోళ్లు (నమస్కారము) ఘటించి

యర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి యిష్టమృష్టాన్నంబులఁ బరితృప్తుఁ గావించి సుఖాసీనుఁ జేసి పాదంబుల చెంతఁ గూర్చుండి 'స్వామీ! తాము ఈ భూమండలంబంతయు గ్రుమ్మరి వచ్చినవారుగాఁ గానవచ్చుచున్నారు. మీ రేయే దేశంబులు మెట్టినారు. ఏయే పుణ్యనదులఁ గ్రుంకినారు. ఏయే దివ్యక్షేత్రములఁదిలకించినారు. ఏయేపర్వతరాజములను వీక్షించినారు. ఏయే ఖనిజ సంపత్తినిఁ గాంచినారు. ఆయా వింతల నామూలాగ్రంబుగ సెలవిండు. నేనుజని, కనకున్నను, విని తనియుదును. మన మారట పడుచున్నది. చనవింత తీసికొంటిని. నను మీ తనయునిగాఁ గనికనికరించి వినవలయు ఘన విషయంబులెల్ల వాక్రువ్వుఁడని యనయంబు వినయంబు దోఁప నగుడడుగుటయు నాఋషిపుంగవుఁడు ఆదరంబు దీపింప నా రాజు శిరంబును దన మృదుకరంబునఁ డాఁకి దీవించి యిట్లనియెను. రాజా! నేఁద్రొక్కని దేశంబులు లేవు. నే మునుఁ గని నదులులేవు. నేఁగాంచని క్షేత్రములు లేవు. నే గానని పర్వతములులేవు. నే వీక్షింపని ఖనిజసంపత్తిలేదు. ఇవి యవి యననేల? సమస్త విశేషంబులు గంటిని. మంటిని. నీ వంటి జిజ్ఞాసువు లుంటనేగదా మావంటి ఋషులకు విశ్రాంతి, అశ్రాంతము గనుపట్టును.

రాజా! నేను దొలుదొల్త హిమవంతముపొంత వంత సీమకుఁ జనితిని. అచ్చటఁ గొన్నినాళ్ళు తపంబుండి పరమేశ్వర సాక్షాత్కారము గాంచితిని. పిమ్మట నటనుండి కదలి చని పొదలు ముదమున శర్మణ్యదేశంబునకుఁ జనితిని. ఓహో! యచ్చటి ముచ్చట లేమని వచింతును. ఆ దేశంబునకును నీ

దేశమునకు నెంమును బొందులేదు. అందెందుఁ గనుఁగొంద మన్నను సుందరమందిరములె. ఆ మందిరంబుల నెందును నమందబుద్ధులగు సుందరులె. బుద్ధిసుందరులము గదా యని వారు ముందువెనుక లారయక క్రిందు మీఁదులు గనక చిందులు ద్రొక్కువారు. అందఱు విజ్ఞానమూర్తులు. అందఱు యూధాగ్రేసరులు. అందఱు యంత్రనిర్మాణదక్షులు. అందఱు దూరదర్శులు. అందఱు అసహాయశూరులు. అక్కడ పది యేండ్ల ప్రాయముగలవానికున్న విజ్ఞాన మిక్కడ నేఁబదియేండ్ల వానికి లేదనఁ దప్పేమి? యొప్పే యగును. అన రాజు గేయూరబాహుఁడు మౌనంబుల కలుపొడమ వానికిట్లనియె.

మునీంద్రచంద్రమా! మీరు ముక్తసంగులు. యోగి పుంగవులు గదా! నిర్జనవనంబుల నివసింపక జనాకీర్ణంబగు నా దేశంబున కేల యేగిరి? అందు మీరు పొందిన ఫలం బేమి? వించుఁగాని సెలవిండు. అనుటయు నా నిరాహారి (ముని) ధరాపాలునిఁ గాంచి యిట్లనియె. ఓయీ రాజేంద్రా! త్రికాలజ్ఞులగు ఋషులకుఁ జూడంగూడని వేమిగలవు? యోగ మన నపూర్వవస్తుప్రాప్తి గదా! అట్టి యపూర్వవస్తువు బ్రహ్మపదార్థ మొక్కటియె. ప్రతి మనుష్యుఁడు బ్రహ్మస్వరూపుఁడె కాన బ్రహ్మస్వరూపుఁడగు మానవుఁడు తన తపోబలంబున నేయే దేశంబున నేయే ఘనకార్యంబులను సాధించునో యరయుట యోగులకుఁ గర్తవ్యము. కావుటనే మేము దేశాటనము నిరంతరము గావింతుము. దేశాటనములేని మానవుఁడు కూపస్థమండూకమువలెఁ బ్రపంచజ్ఞానశూన్యుఁడై పుట్టినచోటనె గిట్టును. వాని మట్టిబుఱ్ఱకెట్టి పాటవంబును గలుగదు.

పూర్వము శాల్మలీద్వీపంబున గేహశూరుఁడను రాజొకఁడు గలఁడు. వాఁడు నిజముగ గేహేశూరుఁడు. పొట్టచించి కంచుకాగడా పెట్టి గాంచినను నొక్క యక్కరమైన వాని కుక్షినిఁ గానరాదు. ఆ 'నిరక్షకుక్షి' తన యశిక్షితకు సిగ్గువడక యెంతవారినేని గాసంతేని భీతిలేక గేలిచేయుచుండును. మంత్రుల మంత్రంబు చెవిఁ జొరనీఁడు. పరోత్కర్షను సహింపనొల్లఁడు. పరదేశవార్తలఁ బరికింపఁబూనఁడు. ప్రజల మనవులు వినఁడు. అదిగాంచి విజ్ఞానఖని యను వానిమంత్రి తన ఱేని యజ్ఞతకు మిక్కిలి వగచి వాని నెట్లేని మంచిదారిని బెట్టనెంచి పిట్టల వేఁటయందు నిట్టలంబగు ప్రియంబుగల వానిని బక్షిగణంబు లక్షుద్రంబుగఁ గల యొక సాంద్రారణ్యంబునకుఁ గొనిపోవువాఁడునువోలెను రథారూఢుఁ జేసి పుష్పపురి యను నొక నగరంబుచెంతనుండి తీసికొని చనుచుండెను.

కొంత దవ్వరుగునంతలో నా ధరాకాంతునకు రథవేగంబున నొడలు దిరుగుటయు, వాంతులు గలుగుటయుఁ జింతాక్రాంతస్వాంతుఁడై శాంతి దొఱంగి శకుంత సంతానంబుల వేఁటమాట దేవుఁ డెఱుఁగు. నేఁ గాంతారంబునకు రాఁజాలను. నన్నింటికిం గొంపొమ్ము. పొకుంటివా! నీ పాట్లు నీవ కందువు. అని భీతచిత్తుఁడై తత్తరపాటుతో మంత్రి నదలించుటయు వాఁడు చేయునదిలేక రథంబు ద్రిప్పుమనుచున్నంతలో నా పురాధినాథుని కుమారుఁడు రూపజితమారుఁడశ్వారూఢుఁడై వాహ్యాళి వెడలువాఁడీ విచిత్రంబు గాంచి తన గుఱ్ఱము నాఁగి కొండొక పరికించి తల పంకించి తత్తడి మీఁద నుండియె వాని యుదంతంబు నెఱింగి యాతఁడు

శాల్మలీ ద్వీపాధిపతియగుట తెలిసికొని తన కోటకుఁ గొని పోయి శీతలోపచారంబులుచేయ భటులకు నాజ్ఞవెట్టెను. వెంటనె యా రాకొమరుని యాన నొదలఁ దాల్చి లెంకలు పొంకంబుగా వానిఁదోకొని చని యుశీరనిర్మితంబును, నీహార నీరాభిషిక్తంబును నగు నొక మందిరంబున హంసతూలికా తల్పంబున బన్నుండఁబెట్టి రాజవైద్యుని రావించి చూపిరి.

ఆ వైద్యరాజు గేహేశూరు నాపాదమస్తకంబు దడవి చూచి జ్వరంబు తగిలెనేమో చూతమని జ్వరసూచికా యంత్రము వాని వదనంబున నుంచ నజ్ఞుండగు నారాజు అది తినుపదార్థ మనుకొని యటునిటు పరికించి పరికించి తటాలున మ్రింగెను.

మ్రింగియు మ్రింగుటతోడనే యాయంత్రంబు కంఠంబున నడ్డువడి యిటునటు రాక డోఁకులు మఱింత హెచ్చెను. ప్రేవులు ప్రోవులు ప్రోవులై వచ్చి బైటఁ బడఁజొచ్చెను. అది కని యారాజవైద్యుఁడు వాని మతిహీనతకు నతిమాత్రముగాఁ జింతించి యిట్టి వింతమానిసిని ధరాపాలునిగాఁ బుట్టించిన రమాకాంతు నేమందునని తలంచి కలంగక తన మృదుకరంబున వాని శిరంబున నదిమి కొట్టెను. ఆదెబ్బతో నారాజమ్మో చచ్చితి నని యొకబొబ్బ పెట్టెను. ఆ బొబ్బతో వాని గొంతుకలోని గాజుముక్క లూడి భూమిపైఁ బడెను. వెజ్జు రాజును బుజ్జగించి బ్రతికితివి పొమ్మనెను. సూరెలనున్న నారీలోక మావింతను గాంచి గొంతెత్తి విఱగఁబడి నవ్వ సాగిరి. అదికని గేహేశూరుఁడు సిగ్గువడి బ్రగ్గడఁగాంచి కనుల నీరువెట్టెను. మతిమంతుఁడగు నా సచివుఁడు తన

యేలిక మతిహీనతకు వగచి వెజ్జు ననుమతిం బడసి రాజకుమారునకుఁ గృతజ్ఞతఁ దెలిపి తొంటిబాటనంటి తన మంటితేని నింటికిఁ గొనితెచ్చెను".

వింటివా రాజా! దేశాటనము లోకానుభవము లేని యాగేహేశూరుఁ డెట్టి యవమానము నొందెనో! యవమానము మాట యటుంచుము. రాజే యట్టి వివేకహీనుఁడైనవాని ప్రజ లెట్టి జెట్టులగుదురో యోజింపుము. కావున మముఁబోటి యోగులు లోకకళ్యాణార్థము కేవలము దండకాటవులనే కాక పుణ్యనదీనదంబులనే కాక సకల పల్లిపట్టణంబులను సంచారంబు గావించి యందందు మాడెందంబులం దవిలిన యనుభవంబులను మిమువంటి జిజ్ఞాసువుల కెఱిఁగించి మోక్షద్వారంబు గందుము.

అనఁ గేయూరబాహుఁడు స్వామీ! యెఱుకసాలమి నాయాడినమాటలు మీరు ప్రల్లదంబులుగాఁ దలంపక యాశర్మణ్యదేశ విశేషంబు లెఱిఁగించి నన్నుఁ గృతార్థునిఁ గావింపుఁడని వేఁడుటయు నతం డిట్లనియె.

రాజా! విను. నీయడిగినదానఁ దప్పేమియు లేదు. శర్మణ్యదేశంబునఁ బంటభూములు లేవు. అన్నియు ఱాళ్ళు రప్పలుగల ప్రదేశములు. ఆహారంబునకై యందలి ప్రజలన్యదేశంబులపై నాధార పడవలయును. కాని వారు కుశాగ్రబుద్ధులు, విజ్ఞానఖనులు నగుట ఱాళ్ళనుండియు రప్పలనుండియుఁ బంటలు పండింతురు. మనదేశమందలి కరిసనమునకును నక్కడి వ్యవసాయమునకును నెక్కడ పోలిక లేదు. కొండలలోని బండఱాళ్ళనెల్ల లాంగలయంత్రములు వచ్చి

పిండి పిండి యొనర్చును. ఆనేలపై వివిధ లవణమిశ్రితములగు నెరవులు వాయుయంత్రములచేఁ జిమ్మఁబడును. దోహద యుక్తములగు నాపొలముల పైభాగంబుల సదా విమానంబులు విహరింపుచుండును. ఆ వ్యోమయానంబులనుండి సూత్రపట్టినట్లు విత్తులు విత్తఁబడును. విత్తినభూమి మెత్తఁబడునట్లుగా వైమానికులు వియత్తలంబునఁ జెదరియున్న జలదంబుల ప్రోవుచేసికొనివచ్చి చల్లగాలులు వానిపైఁ బొలయించి వర్షంబు కురియింతురు. వాన లధికమైనపు డాయా గడపల విమానయంత్రములచేఁ జెల్లాచెదరు గావింతురు. ఇట్లు సస్యానుకూలంబులగు వానలు కురియింపను గురవకుండఁ జేయను వలంతులగు నావైజ్ఞానికు లెంతకుఁ దగరు. ఆ పంట భూములఁ గలుపుతీయుటయుఁ గోఁత కోయుటయు, వస్తునూర్చుటయు జంత్రములె కాని మనుష్యులు గారు. వింటివా! రాజా! యింటఁ గూర్చుండి ధరాపాలనంబు గావించు నీవిట్టి చందములు గంటివా! ఎంత తెలివియున్న నేమిలాభము వారు వక్రబుద్ధులు. వక్రబుద్ధులకు దైవమెట్లు సాయపడును. విను. నేనా దేశంబున విహారంబు సలుపునాళ్ళనే యాదేశమునవారికిని శ్వేతద్వీపవాసులకును ఘోరంబగు పోరు సంభవించెను. దేవదానవ యుద్ధము, రామరావణ సంగ్రామము నాపోరాటమున కిసుమంతయుఁ బోలవు. రాత్రియనక పవలు నాక జన్యంబు మహోగ్రంబుగా సాగుచుండెను. స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, కుక్కలు, గుఱ్ఱములు, పక్షులు, పిల్లులుగూడ నాకయ్యంబునఁ గాలుద్రవ్వి పోరఁదొడంగెను. వైమానికులు విమానారూఢులై యాకాశమార్గంబునఁ జని శత్రురాజ్యంబుల నిర్జనప్రదేశంబుల పవమానాతపత్రముల

మూలమునఁ గుప్పలు తెప్పలుగ దిగి శతఘ్నికా సహస్రంబులఁ బ్రయోగించి యగ్నికణములు గురియఁ దొడఁగిరి. శత్రువు లానిప్పుకలుప్పరంబుననుండి గుప్పుగుప్పున బయలు వెడలకమున్న విద్యుద్యంత్రముల నాకర్షించి నిర్వీర్యంబు గావించిరి. అదిగాంచి శర్మణ్యులు పంచమోపాయంబ (శత్రువు తన దేశంబు సొచ్చినపుడు తటస్థముగా నుండుట) శరణ్యంబని కూటనీతి నూఁది మీఁదికార్యంబునకుఁ గడంగ శ్వేత దేశవాసులు కొంతొక వెనుకంజవేసి చనుచుఁ దమ యేగినంత వట్టుగల పైరుపచ్చల దగ్ధంబు గావించిరి. దానం జేసి శర్మణ్యులు కడుపుమండి యంత్రములమూలమున పొగ తెరలు గల్పించి శత్రువులకుఁ గనులు గానరానీకుండఁజేసి యాగ్నేయాస్త్రంబులఁ బ్రయోగించిరి.

ఆ యస్త్రంబుల వారు ణాస్త్రములచే నీరుగాఱఁజేసి వీరు చల్లార్చిరి. ఆయోలంబునఁ బ్రాణిజాలంబు కూటికి, గుడ్డకు మొగమువాచి, యంగలార్చెను. ఇరవాఁగులవాగుకసిమసంగిన చందానఁ బెక్కేండ్లు పోరుచుండ భగవానుఁడు పాపభూయిష్ఠంబగు జనసమూహంబు మాయింప సమకట్టి కణాదుఁడను మునిపుంగవుఁ బ్రేరేచి యొకమారణ యంత్రంబు నిర్మింపఁజేసెను. కణాదుని తపంబు సిద్ధించినది. పరమాణు మిశ్రితమగు యంత్రము నిర్మింపఁబడినది. శ్వేతద్వీపవాసులు దానిఁ బ్రయోగించి శర్మణ్యుల బ్రమందించిరి. మదమణఁచిరి. అణూద్భూతుఁడగు మానవుఁడు అణుశక్తిచే నంతమొందు చున్నాఁడు. బుద్ధి వక్రించినవానిఁ జక్రికూడ రక్షింపఁజాలఁడు గదా! అనుటయుఁ గేయూరబాహుఁడు కరంబులుమోడ్చి

కర్మందికి మ్రొక్కి మునిలోకగ్రామణీ! మీ యమృత వాక్కుల నా మనంబు తనియకున్నది. యింకను దా మే దేశం బున నెట్టి వింతలుగాంచిరి. ఆనతిచ్చి నను మీ శిష్యునిఁ గృతార్థునిఁ జేయుఁ డని వేఁడుటయు నా యోగిపుంగవుఁడు ప్రజావాంఛలను బాటింపక స్త్రీలోలుఁ డగువాని పాలనంబు చాలకాలంబు సాగదని యిట్లనియె.

మన దేశంబున కీశాన్యంబునఁ బారశీకంబను దేశంబు గలదు. ఆ దేశంబును గాముఁడను వసుంధరా వల్లభుండు భల్లంబు సాహాయ్యంబువల్ల నదిమిపెట్టి బిట్టు కట్టడియై పాలించుచుండెను. నరుల వానరులకంటెఁ హీనులుగఁ జూడ సాగెను. వఱదలు వచ్చి పైరులు చచ్చినను, వానలు లేక మానవులు మాఁడినను వాఁడు వారిగోడు వీనులఁ జొరనీక, కాంతాద్వితీయుఁడై స్వాంతంబున సుంతయునక్కటికంబులేక మొక్కలుఁడై యుండెను. కరము (పన్ను) భారము కరంబు గాఱించుచున్నది. పసువు నిలుపుకొనఁ జాలకున్నాము. మా పయి దయావర్షము కురిసి మమ్మరయుమని దీనాలాపంబుల మొఱవెట్టు ప్రజల పరిదేవనంబుల నాలింపక యాతఁడు నక్రందివంబు ప్రియురాలి కటాక్షంబులఁ గట్టువడినట్టు నట్టువ పిట్టవలె నామెచెంగట నృత్యము సలుపుచుండెను. అదికని ప్రజ లదవదఁ (కలంత) చెంది యదనెఱిఁగి తమ కష్టనిష్ఠురము లను వాని మంత్రి కెఱింగించు కొనిరి. మంత్రి యొక పరమ మూర్ఖుఁడు. తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని మురియు వాఁడు. తనకుఁ దోఁచదు. ఒకరుచెప్పిన వినఁడు. అట్టిరాజును మంత్రినిఁ గాంచిన యెట్టి శాంతమూర్తులైన ప్రజలలైన మీ

సరంబగు (అధికము) రోసంబు రేకెత్తకుండునే ! ఉన్నటు లుండి యా జనకదంబ మొక్కవడి నొక్క యర్థరాత్రంబున వానికోటను ముట్టడించి మట్టుపెట్టిరి. కాన ప్రజాభిప్రాయంబు పాటింపక యంగనాసక్తుఁడగు రాజు రిత్తకురిత్త రాజ్యంబు గోలుపోవును. పుత్రార్థంబె వివాహంబని యెఱింగి కొని, తాను దనరాజ్యంబునకు ధర్మకర్తను మాత్రమెయని తలంచి పాలనంబు గావించువాని రాజ్యంబు రామ రాజ్యంబువోలె సుస్థిరమై చిరకాలము విలసిల్లును. కానినాఁ డెల్లవిధముల నాశంబు నొందును.

పారశీకరాజున కత్యంతసన్నిహితబంధువగు విదేహదేశాధినాథుఁడు కర్పూరహాసుఁడనువాఁడు తపోధనుఁడు. పరమధార్మికుఁడు. అధీత సమస్త శాస్త్రచయుఁడు. అభ్యస్త సమస్త నీతిశాస్త్రమర్ముఁడు. అతఁడు కాశ్మీరదేశరాజగు నుదయసింహు ననుఁగుతనయను సరళయనునామెను బరిణయంబై యకంటకవృత్తిమై నేల నేలుచుండెను. వానిపూఁబోఁడి వాని కన్నివిధములఁ జేదోడు వాదోడై కనుసన్నల మెలఁగుచుండెను. అనుకూలవతియై మనసులో వర్తించు నా వనితామణి తనకు బాసటగా నా కర్పూరహాసుఁడు తననేల నాలుగు చెఱఁగులను గల పల్లెపల్లెకుఁజని ప్రజల కష్టసుఖములఁగని వారి కనువగు సంస్కరణంబులను దన పాలనంబునఁ గావించుచుండెను.

ప్రజానుమతంబుగా నాతఁడు ఊర నూరఁ బాఠశాలలు గళాశాలలు స్థాపించి యున్నతోన్నతవిద్యలుఁ బాలబాలికలకు నేర్పించెను. విదేశంబులనుండి వాస్తుశాస్త్రజ్ఞుల రావించి మహానదులకు సేతుబంధనములు గావింపఁజేసి యవ్వారిగా

వారి పురంబులఁ గాలువలద్వారమునఁ బ్రవహింపఁజేసి వత్స రమునకు మూఁడుపంటలు పండునట్లు చేసెను. పల్లెలఁ పట్ట ణంబులఁ గ్రుళ్ళుకంపులు లేకుండునట్లు తటాకోదరజలంబులు పరీవాహముఖంబులఁ బరిశుభ్ర పఱపించెను. ఊడిపోయిన మేడలుగాని పాడుపడిన సత్రములుగాని హరిజను లడుగిడ రాని గుడులుగాని యంత్రకృతములుగాని శకటాదికములు గాని, వ్యయమూలకములైన చదువులుగాని, దూరశ్రవణ దూరదృష్టి యంత్రములు లేని యుపవనంబులుగాని వాణి జ్యంబు పూజ్యంబైన బజారుగాని జలనాళయంత్రములు లేని గృహారామములు గాని, రూపవాణులులేని చలన చిత్రం బులు గాని, కుట్టిమస్థలులులేని రాజవీథులు గాని, శస్త్ర చికిత్సానిపుణులు లేని వైద్యశాలలుగాని క్రయవిక్రయ సౌక ర్యములు లేని ధనాగారంబులుగాని, తత్క్షణవార్తలులేని పత్రికలుగాని. పత్రికలు జదువని యపాత్రులుగాని, విద్యుద్దీప మయంబులుగాని గృహంబులుగాని వాని మానిత రాజ్యం బున లేవు. అట్లు ప్రజారంజకంబుగాఁ బరిపాలించు నా రాజన్య చూడామణి యొక్క విజయిదశమి మహోత్సవంబు నాఁడు తాను పేరోలగంబుండి మంత్రిసామంతులు చెంత నుండఁ దండోపతండంబులుగా నుత్సవాలోకన తత్పరులై వచ్చియున్న తనప్రజల నీక్షించి 'ప్రజలారా! మిమ్ము నాప్ర జలువోలె నారసి యింతదనుకఁ గాపాడితిని. నేఁబాడితొఱంగి యెందును మిమ్ము గాఱియవెట్టి యెఱుంగను. ఐనను మీరు స్వతంత్రులై స్వపరిపాలనంబు గావించుకొన నుత్సుకులై యున్నట్లు మన్నియోగులవలన వినుచున్నాను. మీకు సంపూర్ణ వాక్స్వాతంత్ర్యము గలదు. నామొగంబు చూచి

చెప్పక మీ యభిమతం బేమో మొగమోటలేక వచింపుఁడు. నేను మెఱకుఁదనంబుతో మీమాటలు గీటునంబుచ్చి కుత్సితుండనై రాజ్యంబు సేయనొల్లను. దాఁపురంబుచేయక వచింపుఁడు. మీ ప్రార్థనంబులు మన్నించుటకే న న్నీసింహాసనమున బరమేశ్వరుఁ డధిష్ఠింపఁ జేసెను. ఈ రత్నమయ కిరీటము మీరక్తమయ ధనముచే నిర్మింపఁబడినదిగాని నా కష్టార్జితము గాదు. అనుటయు సభ్యులందఱు లేచి నిలువఁబడి నైక్యకంఠంబుగాఁ మహాప్రభూ! మీ మహోదార వాక్యంబులఁ దనిసితిమి. నీహార కర్పూర చందనాదులకంటె మీవాక్కులు చల్లనై మాయుల్లంబులఁ బల్లవింపఁ జేసినవి. మేమెల్ల మీపిల్లలము. మీవల్ల నింతవారమైతిమి. మా రాజ్యంబు మాకొసంగి మీరు మధ్యవర్తులై ధర్మకర్తలై మనుఁడు అనుటయు నాకర్పూరహాసుఁడు ఖనిర్మల మనస్సునము క్తకంఠంబున స్వాతంత్ర్యంబు ప్రకటించి ప్రజలకు స్వారాజ్యంబు నొసంగి సర్వజన పూజ్యుఁడయ్యెను.

కృతమెఱింగిన యా ప్రజలును వానినే తమ స్వతంత్ర దేశమునకు నధ్యక్షునిగా నెన్నికొని మన్నించిరి. కావున రాజా! నీవును రత్నసుందరీ యుక్తుండవై కూరుచుండిన యీ నవ రత్నసింహాసనము ప్రజలదని యెఱిఁగి వార్ని గన్నబిడ్డల వలె లాలించి పాలించు మనఁ గేయూర బాహుఁడు ఋషి వల్లభుని పాదంబుల కెరఁగెను. వృత్తాంతంబయు ససాకల్యముగా విన్న రత్నసుందరి హృదయ పరివర్తనంబు గలిగి భర్తృపాదంబులకు మ్రొక్కి యాయోగివల్లభునకునమస్కృతు లాచరించి తనగర్వంబు సర్వంబు విడిచి జ్ఞానోదకంబులఁ

గన్నులు దుడిచికొని భర్తనుఁ బ్రేరేచి ప్రజారాజ్యము స్థాపింపఁ జేసి తన రత్నసుందరీ నామంబు సార్థకంబుగా నెల్లయర్థంబులఁ దానయై ప్రజావల్లభయై ప్రజాహితకార్యంబులఁ బాల్గొనుచు రాచఱికంపు జాఱుకుఁదనంబుఁ గార్యాచరణంబులఁ జూపుచు మాపుల రేపులఁగూడ నేపుమీఱిన యుత్సాహంబుమై దీపించుచుఁ దానె ప్రజ. ప్రజయే తానై రాజిల్లెను.

అంతఁ గొన్నాళ్ళకా రత్నసుందరి కేయూరబాహుఁగాంచి 'నాథా! నాఁడు దేవరయొద్దకుఁ జనుదెంచిన మునివరుఁడు చెప్పిన దేశంబులకు మనముకూడఁజని యందుఁగల విద్యా విధానంబుల నారసివచ్చి మన దేశప్రజల కా పథకంబుల నెఱింగింతము. అనఁ గేయూరబాహుఁడా యూరంగల ప్రజానీకంబున కధ్యక్షుండై యున్న చారు చర్యుఁడను వానిఁ దన సభాభవనంబునకు రావించి రత్నసుందరి సూచించిన యభిప్రాయంబు నెఱిఁగింప వాఁడు పోఁడిమిమై నిట్లనియె.

రాజేంద్రా! తాము దేశాటనంబుగావించి వచ్చి యిచ్చటి జనంబుల మనంబులు రంజిల్లునట్లు విద్యా సంస్కరణంబుల గావింతుమని సెలవిచ్చుట యెంతయు సంతసంబు గలిగించుచున్నది. కాన మహాప్రభూ! తామును మహారాజ్ఞియుఁగూడి మాడి యోడఁ బయనంబు నెఱపి యెఱవుగల విషయంబుల నెల్లఁ గ్రుమ్మరి క్రమ్మఱి యనతికాలంబున విజయము చేయుఁడనుటయు, వారా చారుచర్యునకుఁ బనివిన సెలవొసంగి యామఱునాఁడ కతిపయ పరిజన పరివృతులై నావికా యానంబున బుష్యవాక దేశంబునకరిగి యందలి విద్యావిధానంబుల నారయువారై చేరువనున్న విశ్వవిద్యాలయమునకుఁ

జనిరి. ఆ విశ్వ విద్యాలయోపాధ్యాయుఁడు రత్నసుందరీ కేయూర శాహులకు నెదురుకోలు పచరించి యావిద్యాలయమునందలి యుపన్యాస మందిరమునకుఁ దోడ్కొని పోయెను. వారును వానివెంటఁజని తదుపదిష్ట దివ్యాసనంబులఁ గూర్చుండిరి. అంతలో నొక సేవకుఁడరుదెంచి వారికి శీతల పానీయంబుల నొసంగి విశ్రాంతి మందిరము జూపెను. వారా హిరణ్మయ కుట్టిమస్థల మండిత సౌధంబును జొచ్చి, మెచ్చువచ్చు నచ్చపు సురమాలి (గాలి) దిండులుగల యాసనంబుల నుపవిష్టులైరి.

ఆ హార్మ్యమునందలి కుడ్యస్థలులన్నియు నున్నని పాలగచ్చుచే ముచ్చట గూర్చుచుండెను. ఆ గోడల నేడఁజూచినను నా దేశంబునందలి నానా విధ ఖనిజ, శైల లోహాది వస్తు సమృద్ధిఁదెలుపు పటంబులు వ్రేలుచుండెను. వానిం గాంచి యా దేశసంపదను వారు కరతలామలకంబుగా నెఱింగికొనునంతలో నుపాధ్యాయుఁ డరుదెంచి తన దేశమందు ప్రవర్తిల్లుచున్న విద్యావిధానమును సూచించు ప్రణాళికను రత్నసుందరి కందిచ్చెను. అది కని యామె యచ్చెరువు చెంది యట్టి విద్యావిధానము తన దేశమ్మునఁ బ్రవేశపెట్టనెంచి యందలి మంచి చెడ్డలఁ గూర్చి వానినిఁ బ్రశ్నించెను. ఆ యుపాధ్యాయుఁడు కళాప్రపూర్ణుఁడు కావుట, నిట్లనియె.

"సుందరులారా! యొక్కొక్క దేశమున కొక్కొక్క విద్యాప్రణాళిక యనుసరణీయమై యుండును. మీ దేశము ప్రాచ్య ఖండములోనిది. క్రొత్తగా స్వతంత్రత విజ్ఞులగు తమనూలమునఁ గాంచినది. అట్లగుట నందలి భూగర్భంబున గుప్తంబై యున్న ఖనిజసంపత్తి నారసి తన్మూలంబున నన్య దేశంబు

ల్పైన మీ దేశస్థు లాధారపడకుండ సర్వయంత్ర నిర్మాణంబు గావించి దక్షతనొసంగు శిక్షణము పడయునట్లు విద్యాప్రణాళిక సంస్కరింపుఁడు. ఇది యంత్రయుగము. యంత్రముల సాధింపరాని దేదియు లేదు. యంత్ర తంత్రములు రెండును గలిసినచో నా దేశంబువంక నే దేశవాసులు తేటిపాటి జూడఁజాలరు. కావున ముందు మీకు ఖనిజ లోహ యంత్ర రహస్యప్రకాశిక యగు విద్యను విద్యార్థులకు మాతృభాషా ద్వారమునఁ గఱపఁజేయుఁడు.

మీ దేశంబునందలి విద్యావేత్తల వైళంబ యన్యదేశంబుల కనిపి యచ్చటి సాంకేతిక విద్యలనెల్ల నేర్చికొని రాఁబంచి వారు నేర్చిన యా విజ్ఞానవిషయంబుల యజ్ఞులకుఁగూడ బోధపడునట్లు చేయుఁడు. అన రత్నసుందరీ కేయూరబాహులు సంతోషిత స్వాంతులై యా యుపాధ్యాయునకుఁ గృతజ్ఞత తెలిపి తమదేశంబు నభివృద్ధిచేయ వలయునను తలంపు త్వరపెట్టుటచే, వ్యోమయానంబులఁ బయనించి స్వదేశంబున కరుదెంచి చారుచర్యుని రావించి తామారసి తెచ్చిన విద్యాప్రణాళిక వానికొసంగిరి. వాఁడును బోఁడిమి గలవాఁడగుట నాఁడు నాఁటికిఁ దన దేశం బభివృద్ధిచెందు నా విద్యాప్రణాళిక యెల్లయెడలఁ బ్రవేశపెట్టెను. పంచవర్షములకె యా విద్యాప్రభావంబున విద్యార్థులందఱు నా యా విద్యల హృద్యంబుగ నేర్చి పేర్చి తమ దేశంబునకు సౌభాగ్యంబు చేకూర్చిరి. అది కన్నులారఁగాంచి రత్నసుందరీ కేయూర బాహులు పరితృప్త హృదయులై సుఖంబుండిరి.

ఇతిశివమ్.

# నీతి - కథ

నరుస పుటలు

